జయదేవ, 12th Cent.

గీతగోవిందమహాకావ్యము

రాజమండ్రి, 1936.

Record no. 51

Jayadēva, 12th Cent.

Gītagōvindamahākāvyamu

Rājamaṇḍri, 1936.

Record no. 51

# Bibliographic Record Target

జయదేవ, 12th Cent.

గీతగోవిందమహాకావ్యము :: అష్టపదులు / శ్రీకృష్ణదాస జయదేవకవి ప్రణీతము. - రాజమండ్రి : కొండపల్లి వీరవెంకయ్య, 1936.

14, (2), 96 p. ;21 cm.

Record no. 51

Jayadēva, 12th Cent.

Gītagōvindamahākāvyamu :: Āṣṭapadulu / Śrīkṛṣṇadāsa Jayadēvakavi pranītamu. - Rājamandri : Kondapalli Vīraveṅkayya, 1936.

14, [2], 96 p. ;21 cm.

Record no. 51

# గీతగోవిందము

## అష్టపదులు

" సరసకవితాచాతురిధురీణ "

శ్రీ కృష్ణదాస జయదేవకవి

ప్రణీతము.



శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,
రాజమండ్రి.

# శ్రీశుద్ధనిర్గుణతత్వ కందార్థములు

( తాత్పర్యసహితము )

పాఠకా !

హిందూమాత మన్నివిషయములయందును వాసిఁగాంచినది. మన దేశము తత్వవేత్తలకుఁ బ్రసిద్ధిఁ జెందినదని ప్రాచీనచరిత్రలు చెప్పెడి మాట యఁటుంచుము. ఈనాఁడొకఆంధ్రుఁడు పాశ్చాత్య దేశీయతత్వవేత్తలందరి జోహారు లందుకొనుచున్నాడు. ఆముష్మికముపనిషత్తులభావ మెరింగినవారికిఁ గరతలామలకము. ఈయుపనిషత్తులలో నుండి పిండితీసిన సారము సామాన్యజనులకు బోధపడునటుల నీతత్వములు వ్రాయఁబడి నవి. గ్రంథకర్తయగు భాగవతుల కృష్ణదాసస్వామి వేదాంతలోకమునకు బరిచితుఁడే. నీ వొకసారి దీనిని చేతపట్టితివేని యమదూతలు నీవంక కన్నెత్తిచూడరు. ఉదాహరణమున కొకతత్వము నిచ్చితిమి చూడుము.

క. చచ్చుట పుట్టుట మెలకువ
వచ్చుట గాఢపుసుషుప్తి వచ్చుట యివినా
ల్గచ్చుముగ సహజ మెఱుకకు
బొచ్చెము యీయెఱుకనిల్వఁ బోదుమ యప్పా.

వెల 0—12—0

---

శ్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

**Best copy available.**

శ్రీ

# గీతగోవిందమహాకావ్యము

(అష్టపదులు)

శ్రీకృష్ణదాస జయదేవకవి ప్రణీతము.

వతికి శ్రీనివాసరావు తెలుగు పద్యములు

(సంస్కరణకర్త)

వెదుసూరి గంగాధరం.

పబ్లిషరు

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

---

రాజమండ్రి కందుల సూర్యారావు బ్రదర్సువారి
రామమోహన ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.

1936.

 [వెల 0—8—0

శ్రీ రస్తు.

# శ్రీకృష్ణభగవానుఁడు.

శ్రీ పరమేశ్వరుఁడు భువన సంరక్షణార్థమై తానీ ధరాతలమున నవతరించెదనని వేదములో చెప్పి,

శ్లో. మత్స్య కూర్మ వరాహశ్చ । నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ । బౌద్ధరే కల్కికిరేవచః ॥

అనునట్టి దశావతారములెత్తి ప్రపంచమును రక్షించెను.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ । సంభవామి యుగేయుగే ॥

అని భగవద్గీతలో వచియింపబడినట్లు శ్రీహరి యుగయుగములందు ధర్మసంస్థాపనార్థ మవతరించి లోకముల నుద్ధరించును. కావున శ్రీ మహావిష్ణువు శ్రీ కృష్ణభగవానుఁడుగా భూలోకమున నవతరించి, దేవకీవసుదేవుల చెఱబాపి దుర్మార్గులను గూర్చి భక్తులకోరికలు దీర్చి, లోకమునకు అమూల్యములగు యుపదేశములను భగవద్గీతయను మహా గ్రంథముద్వారా బోధించెను. భగవద్గీతలో ఇట్లుపదేశించెను.

శ్లో॥ పితాహ మస్య జగతో । మాతాదాతాపితామహః
వేద్యం పవిత్రమోంకార । ఋగ్సామయజురేవచ ॥

ఈజగత్తునకు నేనే తండ్రిని; తల్లిని; ప్రయోజన ప్రదుఁడను; తాతను; తెలియఁదగినవస్తువును; పరమ పావనమైన పదార్థమును; ఓంకారమను; చతుర్వేదంబులును నేనే యగుచున్నాను.

శ్లో॥ బ్రహ్మణ్యాదాయ కర్మాణి । సంగంత్యక్త్వాకరోతియః
లిప్యతేన సపాపేన । పద్మపత్రమివాంభసా ॥



ఎవఁడు సమస్త కర్మలను పరమాత్మయందు విషయంబు చేసి సర్వసంగ పరిత్యాగ మొనరించి, పరాధీనునివలె ప్రకాశించునో, యట్టి పురుషుండు పద్మపత్రమునకు గల్గిన సంబంధమువలె పాప పంకంబుచేత నిర్లేపుఁ డగుచున్నాఁడు.

అని యుపదేశించెను. అట్టి భగవానుని లీలామానుష చర్యలను గుర్తింపనేరక, కొందరు యవి నీతికరముగు కార్యముల కొడబడిమేసత్తయగు రాధను కూడెనని పల్కుదురు. అస్ఖలిత బ్రహ్మచారి జరిపిన చర్యలన్నియు నాతని లీలలుగాని క్రియలు గావని గ్రహింపవలయును.

# రాధావృత్తాంతము.

శ్రీ మద్వైకుంఠపురంబున నొకనాఁడు పరంధాముఁడు యంతరంగ భక్తులతో వినోదముల దేలుచుండగా యింద్రాణి చనుదెంచి యాతని దివ్యమంగళ స్వరూప సందర్శనమున గలిగిన ప్రమోదమున మగ్నమై శ్రీహరిని యమందానందమున నమ్రభావముతో స్తుతించి "ఓ కేశవా! నన్ను నీయుత్సంగమున కాశ్రితురాలిగా జేయవే" అని ప్రార్థింపఁగా, శ్రీహరి మన్మథమోహన బాణపాతములకు బాలయిన యాభామను విలోకించి నవ్వి, ఇంద్రాణీ! నేను సాధు సంత్రాణ శీలుండనై భూలోకమున దేవకీవసుదేవులకు కృష్ణనామమున సుతుఁడనై యవతరింపనుంటిని. నీవు నందునకు చెలియలివై రాధా నామంబున జన్మించుము. ఆవట్టున నీయభిమతమును దీర్చెదను" అని యనుగ్రహించెను. అనంతరము శ్రీహరి వసుదేవునకు పుత్రుఁడై పుట్టెను. శచియును తన కోరికఁదీర్చు తొందరతో భూమియందవతరించెను. ఆమెయే యీరాధ:—

# భక్తి-గీతగోవిందము.



భగవ దాజ్ఞచే భగవదాంశము గల మహామహులీభువనమున జన్మింతురు. లోకములో నొక్కొక్కమారు పెక్కువిషమపరిస్థితులు మేళవించి మానవుల భక్తి క్షేమాభివృద్ధులకు హాని కలిగించు చుండును. ఈ దుస్థితిబాపి మానవలోకము నుద్ధరించుట మహాత్ముల విధియై యున్నది. అట్టి వారిలో శ్రీ వేదవ్యాసాది మహాకవులు శంకరాచార్యాది మతకర్తలు లోకమునకు కళ్యాణమును గూర్చిరి.

కర్మ యోగజ్ఞానయోగములచేత భగవత్సాక్షాత్కారము నొందుటకంటె భక్తియోగము చేత దయామయుండగు శ్రీహరి స్వరూప సాక్షాత్కారమును బొందుట మిక్కిలి సులభము, భక్తి యోగము. సర్వులచేత ననుభవింపఁదగినదియు, సర్వకాల సర్వావస్థల శుచిత్వాశుచిత్వములనైననిరీక్షింపకయే,యుపాసింపఁదగినదిగానున్నది.

భాగవత విలాసంబులు పరిభావయుక్తంబులై పరికాశించు చుండును. భగవద్గుణానుభవము అనెడి సుధారసపాన విశేషముచేత మత్తులగు పరమభాగవతులకు వేఱే కావలసిన దీ లోకమున నేమి గలదు? భగవత్ప్రార్థనవలన సమస్తకర్మలను భగవదర్పణఁజేసి భవబంధములనుండి విడుదలజెంది పునరావృత్తి రహితమైన జీవను క్తినిబొందుట యెల్లర కర్తవ్యంతావశ్యకము.

ఇందులకు నిదర్శనముగా శ్రీ జయదేవ మహాకవి శ్రీహ యొక్క దివ్యలీలామృతమును నభివర్ణించి, శ్రీహరిని సర్వ శృంగార మూర్తిగా నుపాసించి, అరిషడ్వర్గంబులను జయించి, దివ్యమహిమను సంపాదించి, శ్రీహరి సాయుజ్యమును బొందెను. ఆమహానీయుని కృతిరత్నమగు గీతగోవిందమునందు 24 తరంగములును, 72 శ్లోకములును గలవు. శ్రీహరి దివ్యశృంగార లీలలను భక్తిరస పురస్సరంబుగా నభివర్ణింపఁబడిన శ్రీ గీత గోవిందమును పఠించి శ్రీహరి కరుణా కటాక్షముబొంది ధన్యులుగుకండు.

# శ్రీ జయదేవకవి జీవితచరిత్రము.



శ్లో. శ్రీభోజదేవ ప్రభవస్య రామా। దేవీసుత శ్రీజయదేవ కస్య
పరాశరాది ప్రియవర్గ కంఠే। శ్రీ గీతగోవింద కవిత్వమస్తు॥

ఈ శ్లోకము వలన శ్రీజయదేవ కవివర్యుని తల్లిదండ్రుల నామ[illegible]న్నవి. ఏడవ యష్టపదిలో "తిందుబిల్వసముద్ర సంభవరోహిణీ రమణేన" అనుటవలన నివాసపురము గోచరమగు చున్నది.

దివ్యక్షేత్రమగు జగన్నాథమును పరిసరములందుగల తిందుబిల్వమను గ్రామంబున భోజదేవుడు రామాదేవియను సదాచార సంపన్నులయిన బ్రాహ్మణదంపతులు కలరు. వీరికి సంతానము లేనందున, రామాదేవి భగవద్భక్తిగలిగినదై నిత్యమును తన యింటికడ జగన్నాథుని హృదయసీమను నిలిపి నిశ్చలమైన భక్తితో; దీనశరణ్యా! భక్తవత్సలా! దాసురాలనగు నాపై భవదీయ కరుణాకటాక్షముంచి "కులవర్ధనుఁడును, భక్తుఁడును, జననీజనక బంధవిమోచనుండును, అగు పుత్రరత్నమును యిచ్చి మా భార్యాభర్తలజన్మలు సార్థక పరచవా, సర్వేశ్వరా" అని ప్రార్థించుచుండెను. ఆ భక్తురాలుపై దయయుంచి, శ్రీమన్నారాయణుఁడు తన సన్నిధిని గల వేదవ్యాస మునీంద్రుని వీక్షించి "ఓ మునివర్యా! నీవవశ్యము తిందుబిల్వ వాసుఁడగు భోజదేవుని భార్య రామాదేవి గర్భమున జన్మించి, మానవ లోకమున గల నరులకు భక్తిప్రపత్తులు బోధించి తరింపఁజేయుము. ప్రజల నుద్ధరింపుము" అని యానతిచ్చెను.

జగన్నాథుఁడా రాత్రి భోజదేవుని కలయందు ముసలివేషమున కనిపించి "విప్రవర్యా! నీ భార్య నన్నర్చించు చున్నందులకు మెచ్చి

యామె కోరుచున్న వరమిచ్చితిని. మీరిఁక ధన్యులుకండు" అని యదృశ్యమాయెను. అంత భోజదేవుఁడు మేలుకొని భగవంతునిలీల కానందించి భార్యనులేపి తన స్వప్నవృత్తాంత మెఱిఁగించి "నీవేమి కోరికగోరితివ"ని అడిగెను. అందులకామె మందస్మిత వదనముతో "ప్రాణేశ్వరా! మనలను కృతార్థుల జేయునట్టి సత్కుమారుని గోరితిని" అని వచియింపఁగా "ఓసీ! తెలివితక్కువదానా! ముక్తి గల్గు పరమేశ్వరుని యాత్మసాక్షాత్కారమును గోరక భవబంధమూల మగు సంతానమును గోరి, "స్త్రీలు వివేకహీనులు, చపలచిత్తులు" అను సామెతను సార్థకపరచితివి. బుద్ధికర్మ ననుసరించును. గతమునకు చింతించిన లాభములేదు" అని పరితాపముగలవాఁడై భార్యతో మాట్లాడక కాలము గడుపుచుండెను.

రమాదేవి భర్తమాటలువిని కటకటంబడి "పుత్రులులేని వారికి గతులులేవు. పుత్రులులేనివారు పున్నామనరకమున బడుదురు" అను పురాణవాక్యమునమ్మి సుతునిగోరి పతికి విరోధినైతిని. భక్తిసల్పి శ్రీహరిని మెప్పించిన ఫలమేమి? "పతికి పనికిమాలినదాన నగుటవలన నాజీవితము వృథాయయినది." అని లోలోన పరితపించి "ఓ జగన్నాథా! పతికహితమైన వరముగోరి యాతని యనుగ్రహము నకు దూరమైతిని. నన్ను కాపాడుము" అని ప్రార్థించెను. అంత జగన్నాథస్వామి భోజదేవునకు పూర్వము కనఁబడిన రూపముననే గనబడి, భక్తుడా నీవేల విచారించెదవు? నీకు జనించు సుతునివలన మీ వంశమంతయు తరించును" అని చెప్పి మాయమయ్యెను. భోజు డంత మేల్కని తనస్వప్నవిధము భార్యకుజెప్పి యెప్పటివలెనే భార్యతోసుఖముగా కాలము గడుపుచుండెను.

కొంత కాలమునకు రామాదేవి యొక శుభదినమున కుమారుని గనెను. తల్లిదండ్రు లాకుమారుడు దైవవరప్రసాది కావున



"జయదేవుఁడు" అను నామకరణముజేసి మిగుల గారాబముతో పెంచుచుండిరి. బాలుఁడు దినదిన ప్రవర్ధమానుండై వయసుతోఁబాటు వేదవేదాంగములయం దసమాన ప్రజ్ఞయు, సకల కళలయందు నిపుణతయు, భగవద్భక్తియు, మానవసేవయు, సూక్ష్మబుద్ధియు, పెంపొందించుకొనెను. బాల్యమునుండియు నీతఁడు జగన్నాథస్వామిపై సంకీర్తనలు రచించి తనమృదుమధురగానముచే రసము చిప్పిల బాడుచు, తన్ననుసరించు భక్తలోకమునకు జెప్పుచు, జగన్నాథమున జరుగు ప్రతియుత్సవమునకును పోవుచు స్వామిని భక్తిశృంగారముల చేత స్తుతించుచు జనరంజకుఁడై యుండగా తల్లిదండ్రు లాకుమారుని గని పరమానందముతో కొంతకాలము జీవించి భగవత్సాన్నిధ్యము చేరిరి. జయదేవుఁడు పరమపదించిన తల్లిదండ్రులకు యావత్కర్మలు నిర్వర్తించి, తిందుబిల్వమునుండి జగన్నాథమునకు బోయి యచ్చటనే నివసించుచుండెను.

కొంత కాలమునకు జయదేవుడు మరికొన్ని యష్టపదులను రాధామాధవ పరముగ తన భాషాకుశలత్వమున నాయకీ నాయక భావములను వెల్లడించుచు శృంగారరసముచేత సమగ్రముగాఁబోషించి గీతగోవిందమను భక్తిరస ప్రాధాన్యతను జెందిన గ్రంథమును యిరువదినాల్గు అష్టపదులతోను డబ్బైరెండు శ్లోకములతోను పూర్తిగావించెను. అష్టపదులు శ్లోకములు జనుల యామోదమునకుఁబాత్రములయి శ్రీహరి భక్తియావేశమునకు దోహదము సల్పుచుండెను. యాత్రార్థము జగన్నాథమునకు విచ్చేయు భక్తులాయష్టపదులనుశ్లోకములను పాడుచు జయదేవునితో నాడుచు బాడుచు వినోదింపుచుండిరి. అట్లు వచ్చిన భక్తులలో "పద్మావతీ" యను ప్రౌఢాంగన జయదేవుని మహాత్యమునకు వశ్యమై గాన, నర్తన ప్రావీణ్యములను ధారాళముల నలవరచుకొని జయదేవునితోఁబాటు రాధామాధవ కైంకర్యమును

నలుపుచు భాగవతసేవా పరాయణత్వమును గావింపుచు, జయదేవునే నమ్ముకొని జన్మసార్థకమునకు భగవత్సేవ జేయుచుండెను. పద్మావతి జయదేవుని పెండ్లిభార్యయని కొందరీకథ చెప్పుదురు. పద్మావతియొక్క బ్రాహ్మణుని పుత్రిక. ఆమె సురూప సుగుణవిశేషముల భావించి, ఆమె జనకు డామెను శ్రీ మహావిష్ణువునకిచ్చి పెండ్లిచేసెదనని దృఢప్రతిజ్ఞుఁడయి, యితరులకు తన కుమార్తె నీయనని తెలియజేసెను. ఇట్లుండ నొకరేయి యా బ్రాహ్మణుని స్వప్నమున భగవంతుఁడు ప్రత్యక్షమయి, "ఓ భక్తుఁడా! నాకర్పింపఁదలఁచిన నీపుత్రికను నా యంతరంగ భక్తుఁడయిన శ్రీజయదేవునకిచ్చి పెండ్లిచేయుము. అద్దాన నీకు యశముగల్గును, నాకానందము గూర్చినవాఁడ వగుదువు" అని యాజ్ఞనిచ్చి యంతర్ధానమయ్యెనట. అంత నా ధరామరభూషణుఁ డానందముతో భగవదాజ్ఞ ప్రకారమే తన పుత్రికను శ్రీజయదేవున కిచ్చి యథాశాస్త్రీయముగా వైవాహికము గావించెనట.

ఈగ్రంథమందలి 2 వ శ్లోకమును బట్టి చూడఁగా జయదేవుఁడు గీతములను పాడుచుండఁగా పద్మావతీదేవి వైదుష్యవిశేషాలంకృతయై నాట్యము సలుపుచుండెనని, ద్యోతకమగుచున్నది. కావున పద్మావతి, ప్రౌఢాంగనయు, నాట్యముచేయునదియు, నలుగురి యెదుట శృంగారభావము ప్రకటించుచు హస్తాభినయములను జేయునదనియు, యూహించినచో ఆమె బ్రాహ్మణస్త్రీ కాదనియు, కులాంగన కాదనియు, నిర్ధారణ యగుచున్నది. కులాంగనలిట్టి కార్యములు యెచ్చటను కావించుట ధర్మవుగా దోపకుండుట వలన పద్మావతి శ్రీ జయదేవుని పెండ్లిభార్యమాత్రము కాజాలదు.

ఏది యెట్లున్నను శ్రీ జయదేవకవి "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" అను బిరుదమును, రాజసన్మానము లక్ష్మీకాంత చరణారవిందభక్తిని, ప్రజారంజకత్వమును బొంది విశేష ప్రఖ్యాతివంతుఁడై యుండును.



శ్రీజయదేవుని గీతగోవింద మత్యనతి కాలముననే దేశమంతటను వ్యాపించి పండితపామరులచే నాదరింపఁబడి పఠింపఁబడు చుండెను. ఆ కాలమున ఓఢ్రదేశమును పాలించు సాత్యకి అనురాజు శ్రీజగన్నాథస్వామి గుణగణవర్ణనగల కొన్ని గీతములను వ్రాసి, ప్రజలను తాను వ్రాసిన గీతములనే పాడవలయునని ప్రేరేపింపఁబడు చుండెను. ప్రజలు రాజుచే ప్రేరేపింపబడియును రాజుగారిచే వ్రాయఁబడిన గీతములను పాడక జయదేవుని గీతములనే పాడుచుండిరి. అంతట రాజు ప్రజలను రప్పించి "నాగ్రంథమేల యాదరింపరు? జయదేవుని గ్రంథమేల నిరాకరింపరు?" అని అడుగగా, వారు నిర్భయముగ రాజుతో నిట్లనిరి. "ఓ రాజా! నీ గీతములు జయదేవుని గీతములతో సహస్రాంశమేని పోలియుండలేదు; అవి పాడునపుడు శ్రీకృష్ణభగవానుఁడు తాండవమాడుచు విని యానందించునట్లు కనబడును. మీగీతములు పాడునపుడు స్వామిలీలయే కనిపించదు. అందువలన వాటినే పాడెదము" అన విని రాజు "మీరు పక్షపాతముగ బలుకుచున్నారు. నేను వ్రాసిన గ్రంథమును జయదేవుఁడు వ్రాసిన గ్రంథమును యీ భగవత్సాన్నిధ్యమున నుంచెదను. ఏ గ్రంథము స్వామియంగీకరించునో యది దేవాలయమున నుండును. తక్కినది యాలయము వెలుపలనుండును" అనిచెప్పి యా గ్రంథద్వయము నాలయపీఠము నందుంచి దేవాలయ కవాటము బంధించి బీగము ముద్రలు వేసి నగరికిఁ బోయెను.

మఱునాఁడుదయమున రాజు ప్రజలతో బయలుదేరి దేవాలయముకడకు వచ్చెను. బీగము ముద్రలు ముద్రలు గానేయుండ కళ్యాణ మంటపముదగ్గఱ తనగ్రంథము పడియుండుటయును, దేవాలయములో స్వామిసాన్నిధ్యమున జయదేవుని గ్రంథముండుటయును గని మిగుల విషాదమునొంది తన కవమాన మగుటకుసహింపలేక స్వామియెదుట నిలిచి "ఓ జగన్నాథా! యో విశ్వేశ్వరా! యో కరుణాపయోనిధీ!

యో భక్తవత్సలా! నీకింత పక్షపాతము జూపుటకు నేజేసిన యుపచారమేమి? జయదేవుడు నేసిన యుపకారమేమి? ఇట్టి భేదభావము నీసర్వజ్ఞసమత్వమునకు విరుద్ధముగదా? "మాంపాహి" అనువారి నెందరిని నీవు రక్షించలేదు? మాయిరువురి గీతములును నీమహిమను వెల్లడించునవేగదా! అట్టి నాగీతములను యీయశేషజన సమక్షమున వనికిమాలినవని దేవాలయము వెలుపల బారవేసితివేల? ఒకరి దాక్షిణ్యము నీకేల? నిగ్రహాబుద్ధినిమాని నాచేసినగ్రంథమును గైకొంటివా మేలగును లేనిచో నాకరవాలంబున నాశిరస్సు నీసరసిజ చరణములదరి సమర్పించెదను. "ఇదియే నాప్రతిజ్ఞ" యని ప్రలాపించుచు ప్రాణాపహారమునకు కృతకృత్యుడై యుండగా అంత శ్రీలక్ష్మీకాంతుడు ప్రత్యక్షమై "ఓ భక్తుడా! సాత్యకీ! జయదేవుడాత్మప్రజ్ఞగలవ్యక్తి, ముక్తజీవుడు, సామాన్యుడుకాడు, జితేంద్రియుడు. నీవు "నేనురాజు" నను గర్వముగలిగి జయదేవునియందు మత్సరము వహించి యీర్ష్యబూని యుంటివి. యుక్తమునకిది లక్షణముగాదు. భేదభావము, అసూయ, గర్వము, భగవత్సాన్నిధ్యమున కూడవు. నిర్మలమనోనురాగములు గాని పరమాత్మప్రాప్తికి వేరు మార్గములేదు. నీవుగతమునకు విచారింపక నిర్మలచిత్తుండవై భక్తితో జయదేవుని గీతగోవిందమును, గానముచేయుము, నీకళంకము వాయును. నీదృఢభక్తికి మెచ్చితిని. ఈ గ్రంథమునందలి యిరువదినాల్గు శ్లోకములును, పదమూడు గీతములును, భక్తిపూరితములని నేనంగీకరించితిని; నీవు సుఖముగావర్థిల్లుము" అని యానతిచ్చి శ్రీహరి యంతర్థానమయ్యెను. అంతట రాజు డెందంబమందానందమునొంది, భక్తితో జయదేవుని గీతములుపాడి భక్తి తాత్పర్యములతో మెలగుచుండెను. ఒకరోజున భక్తులు గీతములు పాడుచుండ దేవాలయమునందలి గంటపైన స్వామి ఆనయిచ్చిన సంఖ్యప్రకారము మ్రోగినది. భక్తులు ఆ ఘంటానాదమును విని రాజుగారి గ్రంథమునుండి, ఆ సంఖ్య ననుసరించి, గీతములు, శ్లోకములు, పఠింపదొడగిరి.



పద్మావతి యొక్క తల్లి కూతురుని చూచుటకయి జగన్నాథమునకువచ్చి, జయదేవునడిగి పద్మావతిని కొలది రోజులలో పంపెదనని చెప్పి కూతురును తీసుకొని తనగ్రామమునకు బోయెను. జయదేవుడు పద్మావతి మోహమున మునిగి శ్రీహరిని ధ్యానింప వీలుకలుగకుండుటచే యొక యడవికివెళ్ళి పరమేశ్వరుని గూర్చి తపంబు చేయుచుండెను. కొన్నిరోజులకు పద్మావతి జగన్నాథమునకు వచ్చి జయదేవుని జాడ తెలిసికొని యడవికిజేరి యాతడు నిష్ఠమాను వరకును వేచియుండి లేచినతరువాత నాతనికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యాతనిచే ప్రేమింపబడెను. పిదప యిరువురును జగన్నాథము చేరి సుఖముగా జీవింపుచుండిరి.

తరువాత జయదేవుడు భగవత్సంకీర్తనమును సలుపుచుండగా "బిల్వగామము" అను పురవాసి వైశ్యశిఖామణి తీర్థ సంసేవనమునకై వచ్చి జయదేవుని ప్రభావమునకని శిష్యుడై భగవద్గుణానుభవము నేయుచుండెను. తానువచ్చి చాలకాల మగుటచే తనగ్రామమునకు బోవ నిశ్చయించి గురువుగారి చరణారవిందములపై వ్రాలి "గురువర్యా! నాగ్రామమునకు నేను ముఖ్యముగా బోవలసివచ్చినది. తమను విడిచివెళ్లుటకు డెందంబెంతయో కుందుచున్నది. తాము మాపురంబునకు విచ్చేసి మద్గృహంబు పావనంబుజేసి, నేనొసరించు నాతిథ్యమును స్వీకరించి, నన్ను కృతార్థుని జేయుడు" అని ప్రార్థించు శిష్యుని హృదయతాపమును దీర్చుటకున్ను ఆతని వినయవిధేయత భక్తిభావమునకు సంతసించి, వర్తకునితో బిల్వగామము పురమునకు వెళ్ళి వారియింట కొన్ని రోజులుండి, మరల తన గ్రామమునకు వెళ్లుటకు ప్రయాణము కాగా, ఆవైశ్యదంపతులు జయదేవుని శక్త్యానుసారముగా పూజించి, యొక పల్లకీసిద్ధపఱచి, దానిలో కొంతధనమును నగలును పెట్టుచుండగా, జయదేవుడు చూచి, "ప్రాణాంతకమైన

యీ ధనము వలద"నఁగా; స్వామీ! ఈధనము తమకు కాదు; పద్మావతీదేవికి కానుకగా పంపుచుంటిమి; తాముతప్పక మాకోరిక నెఱవేర్పుఁడని ఆవైశ్యదంపతులు ప్రార్థించి బోయీలతో "మీరు స్వామివారిని జాగ్రత్తగా వారియిల్లుచేర్చి, యీ ధనమును వారి భార్యకు యీయుఁడు" అని చెప్పి తగురీతి కట్టడజేసి, శ్రీజయదేవ స్వామిని యుచితరీతిని సత్కరించి సాగనంపిరి.

బోయీలు జయదేవుని పల్లకిలోకూర్చుండ బెట్టుకొని తాము మోయుచు యొక ఘోరారణ్యమును ప్రవేసించి ప్రయాణమును సాగింపుచుండగా వారికి ధనము హరింప బుద్ధిపుట్టి జయదేవుని బట్టి "మీకపకారము చేయను నన్నేమియు చేయకుడు" అని బ్రతిమాలు చున్నను వినక సమీపమందున్న లోయ దగ్గఱకు తీసుకొనివెళ్ళి కాళ్లు చేతులు ఖండించి ధనమంతయును తీసుకొని యథేచ్ఛంజనిరి. శ్రీజయదేవస్వామి తత్త్వవేత్తయగుటవలన జరిగినదానికి చింతింపక శ్రీకాంతుని మంతనమున స్మరింపుచు బాధను సరకు జేయక భగవత్సంకీర్తనము గావింపుచుండెను.

ఆదేశపురాజు యడవికి వేటాడుటకువచ్చి, సంకీర్తన ధ్వని నాలకించి జయదేవుని దగ్గఱకు వచ్చి గాయములనుండి కారు రక్తమును వికృతాకారమును వీక్షించి వెఱగంది ఈతఁడొక భక్తుఁడని తలంచి దగ్గరకువెళ్ళి "స్వామీ! మీరెవరు? మీకేలనిట్టి యాపదకలిగెను?" అని అడుగఁగా "ఇది ప్రారబ్ధ కర్మమునకు దగినశిక్ష, అనుభవింపవలయును." అనిజయదేవుఁడాడగా, రాజు "యీమహనీయుని గురువుగా జేసికొని తరింపగలఁను" అని తనలో నూహించుకొని తనవెంట గొని పోయి గాయములు మాన్పించి, తనకు గురువుగాఁ జేసుకొని, యతని యుపదేశానుసారముగా నడచుకొనుచు, తన రాజ్యమునకు వచ్చిన సాధువులను జయదేవుని సన్నిధినిఁబెట్టి వారికుచితరీతి సత్కారములు గావించుచుండెను.



ఇట్లుండఁగా, పద్మావతీదేవి భర్త యింకను రాకుండుటచే యాతనిని వెదకుటకు బయలుదేరి మధ్యమార్గమునందు, తనభర్తకు జరిగినదెల్ల విని, యచటికివెళ్ళి పతిని దర్శించి, జరిగిన దానికి చింతించి క్షేమముగా భర్త చెంతనే కాలము గడుపుచుండెను.

అంత కొంతకాలమునకు జయదేవస్వామి కాళ్ళు చేతులు ఖండించి ధనమును హరించిన దొంగలు, తాము హరించిన ధనమంతయు కర్చుపడిపోగా జీవితయాత్రను నడుపుకొనుటకు శక్తిలేక, యాదేశపురాజు సాధువుల నాదరించుచున్నాడని విని సాధు వేషములతో రాజుసన్నిధికి వచ్చిరి. ఆకపట సాధువులను, రాజసేవకులు జయదేవున దఱికి గొంపోవ, యాసాధువులు జయదేవుని తిలకించి డిల్లపడి భయముచే వడఁక సాగిరి.

శ్రీజయదేవుఁడు వారిని, గ్రహించి భయపడకుడని హెచ్చరించి "ఓ రాజసేవకులారా! వీరిని వెంటబెట్టుకొనిపోయి, రాజుగారితో వీరు పరమభాగవతులని చెప్పి," తగిన సన్మానమును "నేను చేయుమంటినని" వచియింపుడు. అని రాజసేవకులతో యాకపటసాధువులను బంపెను. సేవకులట్లే రాజసన్నిధిని వీరినిచూపి జయదేవుని మాటలను చెప్పగా రాజువారలకమితధనంబిచ్చి వారలనుపల్లకియందు గూర్చుండఁబెట్టి "వీరెక్కడికి వెళ్లదలచెదరో యక్కడ విడచిరండు" అని సేవకులను బోయీలను పంపెను. అంతవారొక యరణ్యమునప్రవేశించిరి. అప్పుడు రాజసేవకులాయిరువురి సాధువులనుజూచి "ఓమహాత్ములారా! మీవలె జయదేవస్వామి మనస్సునకు నచ్చినవారుగాని, ఇంత బహుమానము పొందినవారుగాని, ఇది వరకెవ్వరునులేరు. జయదేవస్వామి మన్ననకు తగినమహిమలు మీయందేవియున్నవో తెలిపిమమ్ము కృతార్థులచేయుఁడు" అనికోరఁగావిని కపటసాధువులు "మాయొద్దనేమి మహిమలునులేవు. తొల్లి జయదేవస్వామి గొప్పతప్పుజేసి రాజువలన

మరణదండన పొందెను. మేము రాజాజ్ఞచే యీతనిని యడవికి గొంపోయి, చంపక కాళ్ళు చేతులు మాత్రము ఖండించి ప్రాణములు రక్షించితిమి. ఆకృపకుగాను మమ్ముల నీవిధమున సన్మానించెను. అని చెప్పగానే ఆకుత్సితుల వాక్యములవలనను, వారి ప్రారబ్ధవశమునను భూమి రెండుగవిచ్చి వల్లకితో నాచోరులనిరువురను తనయందైక్యము జేసికొనెను. ఈవింత కబ్బురవడి రాజభటులు వెంటనే జయదేవుని దగ్గఱకువచ్చి జరిగినదంతయును చెప్పిరి. అదివిని జయదేవస్వామి పశ్చాత్తాపపడి భటులు త్రోవ చూపఁగా నచ్చోటికివచ్చి "ఓదయా మయుండవైన యదుకుల తిలకా! నీచర్యలద్భుతములు, నీ కవ కారము సల్పిన శిశుపాలాదులకు సద్గతులనొసఁగి, నాకపకారము సల్పిన యీసాధువులకిట్లు ఘోరశిక్ష విధించుట నీకున్యాయమా? వారి క్రూరబుద్ధిని మాన్పలేకపోయితివా? నేను నీదాసుడనుగానా? నీకింత నిర్దయతగునా?" అని స్మరించుచు ధ్యానమగ్నుండై యుండగా భక్తవత్సలుండగు శ్రీమహావిష్ణువు జయదేవునకు ప్రత్యక్షమయి, ద్రోహులను బ్రతికించి, జయదేవునకు కరచరణంబులు యథావిధిగా నుప్పతిల్ల జేసి యంతర్ధానమందెను.

జయదేవస్వామి వారందరితోడను పురమును ప్రవేశింపగా రాజాతని మహిమలకును, మానవ ప్రేమకును మిగుల సంతసించెను. జయదేవుని దివ్యమహిమలు లోకమంతయును వ్యాపింపఁగా నెందరో యాతని నాశ్రయించి ప్రపత్తి మార్గముల నభ్యసించి ముక్తినందు చుండిరి.

పద్మావతీదేవి తనభర్తను పరమాత్మునిగా భావించి, పతి సేవానియమములను భక్తితో పాటించుచుండుట రాజుగారి భార్య చూచి యామె పాతివ్రత్యమును పరిశోధింపనెంచి జయదేవుడు జగ న్నాథమున కరిగిన సమయమున పద్మావతితో "నీభర్తను దుర్జను



లడవిలో చంపిరను సమాచారము తెలిసినది" అని చెప్పఁగా భర్త మాహాత్మ్యగుణాలగు పద్మావతీదేవి "హా నాథా! నన్నొడబాసి పోవుట నీకు ధర్మమా! అని నిట్టూర్పుతో ప్రాణములు విడిచెను. యంత రాణి తనయొక్క శోకము వలని ప్రమాదమునకు మతిమాలి పరితపించు చుండఁగా, జయదేవస్వామి వచ్చి రాణి విచారకారణమును విని, పద్మావతి యొద్దకుఁ బోయి భగవంతుని మనస్సునందు నిల్పి భగ వత్సంకీర్తనము చేయఁగా, పద్మావతి నిద్రపోయిన దానివలె లేచి కూర్చుండెను. ఈ పరమభాగవతుని మహిమకందరు నచ్చెరవంది బహుగతుల స్తుతించిరి. శ్రీజయదేవస్వామి యిట్టి మానవాతీతమగు శక్తిని సంపాదించుటకు, ఆతని మనోనిశ్చయమే మూలాధారము. ఇట్టి మహానుభావ కృత్యంబులెన్నో యెందరో పరమభాగవతులు గావించి యుండిరి. భగవంతుఁడు భక్తులపాలిటి కల్పవృక్షము. భగవద్దాసుల కసాధ్యమగున దేదియునులేదు. పుట్టుట గిట్టుటకేయని తెలిసికొని, విరక్తసంగులై భగవద్ధ్యానతత్పరులై జన్మకు పరమార్థమును, ఎల్ల వారలు సంపాదింతురుగాత" అని ప్రార్థించుచుంటిని. ఈజయదేవ స్వామి జీవితము పఠించినవారికి హితపరమసుఖములు పరమేశ్వరుడు ప్రసాదించునుగాక.

---

## ఉపోద్ఘాతము.



ఇది గోవిందునిగూర్చిన గీతములు గలది గనుక "గీతగోవిందము" అనియు, ప్రతిగీతమును ఎనిమిదేసి చరణములు గలది. గనుక "అష్టపది" అనియును, పేళ్లు కలిగి యున్నది. మొదటి అష్టపదియును పందొమ్మిదవ యష్టపదియును యీనియమమును దప్పినవి. ఇందలి డెబ్బదిరెండు శ్లోకములును, యిరువదినాల్గు అష్టపదులును శృంగార రసపూరితములై యలరారుచున్నవి. ధారామృదువు, సందర్భశుద్ధి పరమాధుర్యమ్ము. భావగంభీర్య నిరుపమానందులై విరాజిల్లుచుండెను. వంశదేశీయుఁడగు యీజయదేవుడు ప్రాపంచిక సుఖములు పొందుచు వైష్ణవమార్గమున శృంగార రస వాహినిగా గీతగోవిందమును రచియించెను. ద్రావిడ దేశీయుఁడగు నారాయణతీర్థులువారు బ్రాహ్మణాచారరీత్యా సన్యసించి కచ్చడమును బిగించి శృంగార సముద్రములో తరంగాలవలె శ్రీకృష్ణ లీలా తరంగిణిని రచియించెను. మొదటిది భావోన్మాదము, దేహము సుప్పొంగించుటయు గలది. రెండవది శాస్త్రజ్ఞానము, మేధస్సును తృప్తి పరచుటయును గలది. ఈయిద్దరు ఒకరుగానయి యీరెండుకావ్యములు కలిపినచో యెట్లుండునో; అట్లే ఆంధ్రదేశమున "క్షేత్రయ్య" యను పరమభాగవతశిఖామణి "మువ్వల గోపాలదాసు పదములు" అను పేరుతో నాలుగువేలు కీర్తనలు రచియించెను. ప్రస్తుతము ఆంధ్రుల దురదృష్టవశమున యీ పదములొక్కటైనను తెలుగు నాటిలో లేక ద్రావిడ దేశములో ద్రావిడ లిపిలో ఏడువందలు మాత్రము మిగిలియున్న" వని మా గురువుగారగు "బ్రహ్మశ్రీ విమర్శకాగ్రేసర" మానపల్లి రామకృష్ణకవి యం. ఏ. గారు సెలవిచ్చియున్నారు.

# ఆంధ్రీకరణగీతగోవిందములు.

(1) 1684–1712 సంవత్సరప్రాంతమున శ్రీనివాసకవి సహా రాజాష్టపదిని, (2) మణిగొండ వేంకటరమణకవి శ్రీమదాంధ్రగీతగోవిందమును, (3) పతికి శ్రీనివాసకవి పందొమ్మిదవ శతాబ్ద[illegible] ఆంధ్రాష్టపదిని, మూలముతోసహా ఆంధ్రీకరించిరి. (4) ఏ. వి. నరసింహపంతులుగారు పూర్తిగా తాత్పర్యమును, (5) 1906 సం॥లో (పేరుతెలియదు) పూర్తిగా టీకయును, (6) "విద్యాభూషణ" సూరాబత్తుల సూర్యనారాయణకవిగారు. శ్లోకములకు తెలుఁగు పద్యములను, పూర్తిగా తాత్పర్యమును వ్రాసియుండిరి. యీగీతగోవిందము ఉత్తరదేశములో మిక్కిలి ప్రచారములో గలదని పెద్దలు చెప్పుచున్నారు.

కొందరు భక్తులు ప్రోత్సాహము వలన దీనికి నేను తాత్పర్యమును వ్రాయనెంచి, పతికి శ్రీనివాసరావు రచియించిన పద్యములను మాత్రము, ఆయాశ్లోకముల క్రిందఁ జేర్చి యావద్గ్రంథముల సహాయమువలన యెల్లవారల కర్థమగునటుల నానేర్చినకొలఁది తాత్పర్యమును వ్రాసియుంటిని. మూలమునందలి శ్లోకములకు పద్యముల ఆంధ్రీకరణము స్వతంత్రించుట వలన, సరిపడిన చోట్ల పద్యములను చేర్చితిని, కొన్నిశ్లోకము లాంధ్రీకరింపలేదు. కొన్నిచోట్ల రెండుమూడు శ్లోకములకు ఒకే తెలుగుపద్యము గలిగియున్నది.

పద్యములే చేర్చితినిగాని, కీర్తనలు స్థలవిస్తర భీతిచే చేర్చలేదు. కీర్తనలు చాలా రసవంతముగా నున్నవి.

ఇట్లు సాహసించిన నాయందలి గుణదోషములును ప్రమాదజనిత దోషములును పండితులు మన్నించి, అవి నాకు తెలిపినచో వందనములతో నందుకొని ద్వితీయ ముద్రణమున సవరించుకొందునని వందనపూర్వకముగా మనవిఁ జేసుకొనుచుంటిని.

కొంతమూరు.
శ్రీధాతవత్సరనిజభాద్రపద
బ ౫ మి సోమవారము.

ఇట్లు
సుజనవిధేయుఁడు,
నేదునూరి గంగాధరం.

శ్రీ

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

శ్రీబ్రహ్మజ్ఞాతృభూతేశేభ్యోనమః

అస్మద్గురుబృందపాదారవిందాభ్యాంనమః

# శ్రీగీతగోవిందము

అను

# అష్టపది.

## ప్రథమస్సర్గః

శ్లో॥ మేఘైర్మేదుర మంబరం వన భువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరు రయమ్ త్వమేవ తదిమం రాధేగృహం ప్రాపయ
ఇత్థం నన్ద నిదేశ తశ్చలితయోః ప్రత్యధ్వకుఞ్జ ద్రుమమ్
రాధామాధవ, యోర్జయంతి యమునాకూలేరహః కేళయః॥

చం॥ జలదతతి మస్తమాలకుజ ♦ సాంద్రములయ్యెను దిఙ్నభోవనం
బులు, నిశి భీరువా నితనిఁ ♦ బొల్తుక నీవె గృహంబుఁ జేర్పు మం
చలయఁగ నందుఁడాడఁ జను ♦ నవ్వుడు సూర్యజతీరమార్గ ని
స్తుల కుజకుంజపాళిరతిఁ ♦ జొక్కెడి వారి రతుల్జయించెడిన్॥

తా॥ (శ్రీకృష్ణభగవానుని యందలి భక్తితో నందుఁ డిట్లనుచున్నాడు) "ఓరాధా! ఆకాశము మేఘములచేత దట్టముగా క్రమ్మఁబడి యున్నది. వనభూములు చీకఁటి ద్రుమానులచేత నల్లనై యున్నవి.



శ్రీకృష్ణుఁడు రాత్రియందు భయపడువాఁడగు కారణముచేత, నీవే యీశ్రీకృష్ణుని యిల్లు చేర్పవలెను" అని యీప్రకారముగా నడిన నందుని కొఱకు యాజ్ఞవలన పోవుచున్న రాధాకృష్ణులకు మార్గమునందు గల యమునాతీరము నందలి పొదరిండ్ల యందును, వృక్షచ్ఛాయల యందును, గల యేకాంత ప్రదేశములు రహస్య క్రీడలకు చాల వీలుగా నున్నవి.

శ్లో॥ వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త సద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ
శ్రీవాసుదేవ రతి కేళి కథా సమేతమ్
ఏతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్॥

సీ॥ స్ఫురిత వాగ్దేవతా ♦ చరిత చిత్రితగుణ
సద్మమై నిజమనః ♦ పద్మ మలర
సరస పద్మావతీ ♦ చరణ చారణ చక్ర
వర్తియై తగుల స ♦ న్మూర్తి యలర
ఫణిప సూను కణాద ♦ బాదరాయణ సూత్ర
భరణియై ప్రతిభాను ♦ సరణి యలర
వర చతుర్విధ కవి ♦ తా మరంద నిర్ఝరీ
వేణియై సరస స ♦ ద్వాణి యలర

తే॥ నలరు జయదేవ కవి సము ♦ జ్జ్వలతర, నవ
రత్న మూర్తుల నవరస ♦ రమ్యభూష
ణముల వలె మేనఁ దాల్చిన ♦ నందనంద
నోత్తమ రతి ప్రబంధంబు ♦ నొగి రచించె,

తా॥ సరస్వతీ దేవియొక్క చరిత్రలచేతఁ నలంకరింపఁబడిన హృదయ మనెడి గృహము గలిగిన పద్మావతియను ప్రియురాలియొక్క పాదములను నాట్యమాడించుట యందు సమర్థుఁడైన, జయదేవ శ్రీకృష్ణయొక్క రతిక్రీడలనెడి కథలతోడఁ గూడియున్న యీ ప్రబంధమును వాల్మీకి, వ్యాసుడు, కణాదుఁడు మొదలగు వారు రచించిన కవిత్వమునకు సరిగాను, చతుర్విధ కవిత్వవిలాసములును నవరసంబులును, అలంకారములు, విలసిల్లఁ జేయుచున్నాడు.

శ్లో॥ యది హరిస్మరణే సరసం మనో
యది విలాస కథాసు కుతూహలమ్
మధుర కోమల కాన్త పదావలీమ్
శృణు తదా జయదేవ సరస్వతీమ్. 3

తే॥ సారె నెమ్మది హరిభక్తిఁ ♦ గోరెనేని
యది విలాస కథా కుతూ ♦ హల మయేని
మధుర కోమల కాంత వి ♦ మల పదములఁ
దనరు జయదేవ సద్వాణి ♦ వినుమెపుడును.

తా॥ మీకు శ్రీకృష్ణస్మరణయందు మనస్సు భక్తిరసముతోఁ గూడిన దయినచో; శ్రావ్యములైన మృదువులైన రామణీయ పదజాలములుగల జయదేవుని గానరూపక శ్లోకములను వినుఁడు. లేక మీకు విలాసకథలయందు మనస్సు కలిగినచో; మధురములును, కోమలములును, రమణీయములును, అయిన పదావళులు గల్గిన జయదేవుని గాన రూపమైన గీతములను వినుడు.

శ్లో॥ వాచః పల్లవ యత్యుమాపతి ధర, స్సందర్భ శుద్ధింగిరాం
జానీతే జయదేవ ఏవ శరణశ్లాఘ్యోదురూహద్రుతే
శృఙ్గారోత్తర సత్ప్రమేయ రచనైరాచార్య గోవర్ధనః
స్పర్ధీకోపిన విశ్రుతః శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః ౪



సీ॥ పదములఁ బల్లవిం ♦ పఁగఁ జేయు నయ్యుమా
పతిధరుండు విలాస ♦ మతిధరుండు
తులలేని తీవ్రవా ♦ క్కుల నా కలనమించు
శరణుండు సత్కీర్తి ♦ శరవణుండు
శృంగార రచనైక ♦ కృతిగురుండైన, గో
వర్ధనుండురు కళా ♦ వర్ధనుండు
వినన మాత్రనె గ్రహిం ♦ చ నెఱుంగు ధోయి యన్
కవివరుం డతిగుణ్యై ♦ కవివరుండు

తే॥ గాన సందర్భ శుద్ధిసం ♦ గతి నెసంగు
కులుకు పలుకుల పలుకుల ♦ జిలుకు తళుకు
వెలుఁగు జయదేవుఁ డొక్కఁడె ♦ యెఱుఁగు మఱియు
నితనికిన్ క్షితియందవి ♦ శ్రుతుఁ డహితుఁడు.

తా. ఉమాపతి ధరుండనుకవి పదములను పల్లవింపఁ జేయఁ గలఁడు. శరణ మిశ్రుఁడనుకవి ఊహింప శక్యము కాని శీఘ్రోచ్చారణము అనఁగా ఆశుకవిత్వమును బాగుగా చెప్పగలఁడు. ఈజయ దేవుని గురువైన గోవర్ధనాచార్యుఁడు శృంగార రసము ప్రధానముగా గలిగిన విద్వద్వేద్యమైన రచనలు వ్రాయుగలవాఁడు, ధోయి యను కవిరాజు వినినమాత్రము చేతనే గ్రహించువాఁడు. జయదేవ కవియొక్కఁడే రచనావిశేషముల యొక్క సందర్భ శుద్ధినెఱిఁగి కులుకుపలుకుల జిలుకు తళుకులతో నవరసంబులు నాట్యమాడు నట్లు కవిత్వము చెప్ప నేర్చిన వాఁడు. ఈజయదేవునకు విరోధి యగు వాఁడెవఁడును లేడు.

# అష్టపదీప్రారంభః.

## శ్రీభగవద్దశావతారవర్ణము

(మాళవ రాగేణ గీయతే)

ప్రళయపయోధిజలే-ధృతవానసి వేదమ్। విహితవహిత్ర,చరిత్రమఖేదమ్
కేశవా ధృతమీన శరీర। జయజగధీశ హరే॥ ౧

క్షితిరతి విపులతరే, తవతిష్ఠతి పృష్ఠే। ధరణి ధరణకిణ, చక్రగరిష్ఠే।
కేశవాధృత కచ్ఛపరూప। జయజగదీశ హరే॥ ౨

వసతి దశన శిఖరే, ధరణీత వలగ్నా। శశిని కళంక। కళేవ నిమగ్నా।
కేశవాధృత సూకరరూప। జయజగదీశ హరే॥ ౩

తవకర కమలవరే। నఖమద్భుత శృఙ్గమ్। దళితహిరణ్యకశిపుతనుభృఙ్గ
కేశవాధృత నరహరిరూప। జయజగదీశ హరే॥ ౪

ఛలయసి విక్రమణే బలిమద్భుత వామన। పదనఖనీరజనితజనపావన।
కేశవాధృత వామనరూప। జయజగదీశ హరే॥ ౫

క్షత్రియ రుధిరమయే। జగదపగత పాపమ్। స్నపయసి శమిత। భవతాపం।
కేశవాధృత భృగుపతిరూప। జయజగదీశ హరే। ౬

వితరసి దిక్షురణే। దిక్పతి కమనీయమ్। దశముఖ మౌళి। బలిం రమణీయమ్।
కేశవాధృత రఘుపతిరూప। జయజగదీశ హరే॥ ౭

వహసివపుషివిశదే। వసనజలదాభమ్। హలహతిభీతి। మిళితయమునా
భమ్॥ కేశవాధృత హలధరరూప। జయజగధీశ హరే ౮

నిందసియజ్ఞ విధే। రహహ శ్రుతి జాతమ్। సదయహృదయ। దర్శిత పశు
[ఘాతమ్ కేశవాధృత బుద్ధశరీర। జయజగదీశ హరే॥ ౯



మ్లేచ్ఛనివహనిధనే। కలయసి కరవాలమ్। ధూమ కేతుమివ। కిమపికరా
ళమ్। కేశవాధృత కల్కిశరీర। జయజగదీశ హరే॥ ౧౦

శ్రీజయదేవ కవేరిద। ముదిత ముదారమ్। శృణుశుభదం। సుఖదంభవ
సారమ్। కేశవాధృత దశవిధరూప। జయజగదీశ హరే॥ ౧౧

తా॥ (1) మత్స్యావతారమెత్తిన "ఓకృష్ణా! జగదీశా! హరే; మహాప్రళయమున సముద్రముయొక్క జలమునందు యోడయొక్క చరిత్రము గలిగిన వేదమును ఆయాసము లేనట్టుగా ధరించిన వాఁడవగుచున్నావు. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము (2) కూర్మావతారమెత్తిన యోకృష్ణస్వామీ! జగదీశా! హరే; మిక్కిలి విశాలమైనట్టిన్ని. మందర పర్వతము వలనగల్గిన చక్రాకృతి గల కాయలు గల నీ వీఁపునందు భూమండలమున్నది. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము (3) వరాహ రూపమును ధరించిన యోకృష్ణా! జగదీశా! హరే! నీయొక్క దంతాగ్రము నం దంటియున్న భూమి, చంద్రుని యందణగి యున్న కళవలె నున్నది. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము (4) నరసింహావతారమెత్తిన యోకృష్ణా! యోజగదీశా! హరే! నీయొక్క శ్రేష్ఠమైన కమలమువంటి హస్తము నందద్భుతమైన యగ్రభాగములు గలిగినట్టిన్ని చీల్పఁబడిన హిరణ్యకశ్యపుని యొక్క శరీర మనెడి తుమ్మెద కలిగినట్టిన్ని, గోరు యున్నది. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము(5) ఆశ్చర్యకరమైన వామనమూర్తీ! యోకృష్ణా! జగదీశా! హరే! అద్భుతమైన నీపాదముల గోళ్లయొక్క జలమువలన లోకమును బవిత్రము చేయువాఁడవై ధరింపఁ బడిన వామనాకారముచే త్రివిక్రమావతారమందు బలిచక్రవర్తిని చలింపఁ జేయుచున్నావు. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము. (6) పరశురామావతారమెత్తిన యోకృష్ణా! జగదీశా! హరే క్షత్రియుల యొక్క రక్తమయమైన హ్రదమునందు, పాపమును

పోగొట్టుకొని శాంతి బొంది జనన మరణ తాపత్రయములు గలిగినట్టి జనులను స్నానమాడించు చున్నావు. అట్టి పరశురామావతారా! నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము. (7) రామావతారమెత్తిన యోకృష్ణా! జగదీశా! హరే! ఇంద్రాది దిక్పతులచేత కోరదగినట్టిన్ని ఒప్పుచున్నట్టిన్ని రావణుని పది తలలను రణరంగమునందు దశ దిశలకు బలియిచ్చుచున్నావు. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము. (8) బలరామావతారమెత్తిన యోకృష్ణా! జగదీశా! హరే! తెల్లనైన శరీరము నందు, మేఘమువంటి కాంతి గల్గినట్టిన్ని నీ నాగేటి దెబ్బకు భయము నొందిన యమునానది కాంతి వంటి కాంతి గలిగిన వస్త్రమును ధరింపుచున్నావు. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము. (9) బుద్ధావతారమెత్తిన యోకృష్ణా! జగదీశా. హరే! వేదముల వలన సంభవించిన యాగకర్మము లందు చూపబడిన పశుహింసను జూచి, కటకటా యని నిందించు చున్నావు. దయతోఁ గూడిన హృదయము గల నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము. (10) కల్క్యవతారమెత్తిన యోకృష్ణా! జగదీశా! హరే! యవనజాతి సమూహమును నాశనము చేయుటకై భయంకరమైన యగ్నివలెనున్న ఖడ్గమునొక తీరున పట్టుచున్నావు. నీవు సర్వోత్కృష్టుఁడవు కమ్ము (11) దశావతారములు ధరించిన యోశ్రీకృష్ణస్వామీ! గంభీరమును, మంగళ ప్రదమును, సుఖప్రదమును! సంసార సారమును గల జయదేవ కవిచే చెప్పబడిన యీగీతమును వినుము. నీకుజయము చేకూరును గాక.

శ్లో॥ వేదానుద్ధరతే జగంతి హరతే భూగోళముద్బిభ్రతే
దైత్యందారయతే బలించలయతే క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తుభ్యంనమః॥



చ॥ శ్రుతులనమర్చి భూధరము ♦ సొంపునఁ జేర్చిధరిత్రిఁ గూర్చియా
శ్రితు వ్యథదీర్చి వజ్రికిని ♦ సేమమొనర్చి ధరావరోత్కరో
ద్ధతిఁ బరిమార్చి వారిధిమ ♦ దంబును బీల్చి ప్రలంబునార్చియా
క్షితి భరమున్ విదర్చిహయ ♦ కేళికి నేర్చిననిన్నుఁ గొల్చెదన్.

తా॥ వేదముల నుద్ధరించినట్టిన్ని, లోకములను హరించినట్టిన్ని, భూగోళమును భరించినట్టిన్ని, రాక్షసుని సంహరించినట్టిన్ని బలిచక్రవర్తిని కంపింపజేసినట్టిన్ని, రాజులను బరిమార్చినట్టిన్ని, రావణుని జయించినట్టిన్ని. నాగలిని బట్టినట్టిన్ని, దయను విస్తరింపఁజేసినట్టిన్ని, యవనుల మూర్ఛిల్లఁ జేసినట్టిన్ని, యీవిధముగా దశావతారధారివైనట్టి ఓ శ్రీకృష్ణా! నీకొఱకు నమస్కారము.

---

# ద్వితీయాష్టపది ప్రారమ్భః

(ఘూర్జర రాగేణ గీయతే)

పల్లవి॥ జయ జయదేవ హరేహరే కృష్ణ-జయజయ దేవహరే॥

చరణము॥ శ్రితకమలాకుచమండల-ధృతకుణ్డల-కలితలలితవనమాలిన్ 1
దినమణి మణ్డల మణ్డన-భవఖండన-మునిజన మానస హంసా ॥జ॥ 2
కాళియ విషధర భంజన-జనరంజన-యదుకుల నళిన దినేశా ॥జ॥ 3
మధుమురనరక వినాశనా-గరుడాసనా-సురకుల కేళినిదాన ॥జ॥ 4
అమలకమల దళలోచనా-భవమోచనా-త్రిభువన భవననిధానా॥5
జనక సుతాకుచభూషణా-జితదూషణ-సమరశమిత దశకంఠ ॥జ॥ 6
అభినవ జలధరసుందర-ధృతమన్దర-శ్రీముఖ చంద్రచకోర ॥జ॥ 7
శ్రీజయదేవ కవేరిదం-కురు తేముదం-ఉజ్జ్వల మంగళగీతమ్ ॥జ॥ 8

తా॥ (1) శ్రీలక్ష్మీదేవి యొక్క కుచమండలముల కాశ్రయమైనట్టిన్ని, కుండలములు ధరించినట్టిన్ని సుందరమైన వనపుష్పహారము గలిగినట్టిన్ని ఓ శ్రీకృష్ణా! నీవు సర్వోత్కృష్టుఁడవై వర్తించుము. (2) సూర్యబింబము వంటి భూషణములు గల్గినట్టిన్ని, జననములను ఛేదించునట్టిన్ని, మునీశ్వరుల యొక్క మనస్సులనెడి సరోవరములకు హంసలైనట్టిన్ని, ప్రకాశ రూపుఁడవైనట్టి ఓ శ్రీకృష్ణా! నీకు జయమంగళములుగాక. (3) కాళియుఁడనెడిసర్పమును మర్దించినట్టిన్ని జనులకు సంతోషము కూర్చినట్టిన్ని, యదువంశమనెడి కమలమునకు సూర్యుఁడైనట్టిన్ని, శ్రీకృష్ణా నీకు జయము. (4) మధుముర, నరకులను రాక్షసులను చంపినవాఁడా! గరుడ వాహనా! దేవతా కులము యొక్క క్రీడకు ఆదికారణమైన వాఁడా, శ్రీకృష్ణా జయ జయ (5) నిర్మల కమలనేత్రా! జనన మరణ బాధలను తొలగించు వాఁడా! ముల్లోకముల పుట్టుకకు మూలమైన శ్రీకృష్ణా జయము. (6) జనకసుత స్తలకూలకు భూషణమైన వాఁడా! దూషణుఁడను రాక్షసుని జయించిన వాఁడా, రణరంగమున రావణుని చంపిన శ్రీకృష్ణా జయము. (7) క్రొత్త మేఘమువంటి అందగాఁడా! మందర గిరిధరించిన వాఁడా! లక్ష్మీదేవి యొక్క వదనమనెడి చంద్రునకు చకోరపక్షివంటి శ్రీకృష్ణా జయము. (8) శ్రీమజ్జయ దేవ కవి యొక్క ప్రకాశమానమగు నీమంగళ గీతము సంతోషము నిచ్చుచున్నది.

శ్లో॥ పద్మా పయోధరతటీ పరిరంభలగ్న
కాశ్మీర ముద్రిత మురో మధుసూదనస్య
వ్యక్తానురాగ మివఖేల దనంగ ఖేద
స్వేదాంబు పూరమను పూరయతు ప్రియంవః॥



మ॥ సరసీజాలయ గుబ్బచన్నొరయని ♦ చ్చుంబర్వ కాశ్మీర వం
కరుచి భ్రాజిత మాటవ్యక్తమగురా ♦ గంబాననన్ మించుచున్
స్మర లీలామయయుద్ధ సంజనితభా ♦ స్వత్స్వేద వాః పూరసం
భరితంబౌ మధువైరి వక్షమురసౌ ♦ భాగ్యంబు మాకీవుతన్॥

తా॥ శ్రీలక్ష్మీదేవి స్తన ప్రదేశము నాలింగనము చేత నంటుకొనిన కుంకుమచేత చిహ్నితమైన ముద్రలు శ్రీకృష్ణభగవానుని హృదయాంత రానురాగము గలిగినదో యనునట్లొప్పుచు, మరకేళి వలన గలిగిన యాయాసము చేత చెమటతోఁ గూడిన శ్రీకృష్ణభగవానుని వక్షస్థలము మీకు సంపదల సమకూర్చుగాక.

శ్లో॥ వసంతే వాసంతీ కుసుమ సుకుమారై రవయవై
ర్భ్రమంతీం కాంతారే బహువిహిత కృష్ణాను సరణాం
అమందం కందర్ప జ్వరజనిత చింతాకుల తయా
వలద్బాధాం రాధాం సరస మిద మూచే సహచరీ॥ ౨

మ॥ సకలమోద వసద్వసంతమునవా ♦ సంతీల సత్కోమలాం
గకమై, మన్మథ తాపసంజనిత,శం ♦ కావ్యాకులస్ఫూర్తిసా
రెకుఁ గాంతారమునన్ భ్రమించుచును ♦ శ్రీకృష్ణప్రియాన్వేషణో
త్సుక యాగాధిక, తోడబోటియిటులం ♦ చుంబల్కె లీలారతిన్.

తా॥ వసంత ఋతువునందు వృద్ధిబొందుచున్న పీడను గల్గినట్టి బండి గురిగింజ పువ్వువలె సుకుమారములైన యవయవముచేత చొరరాని యడవియందు దిరుగుచున్నదియును, యొక్కువైన మన్మథ తాపము వలన గలిగిన చింతచేత మనోవ్యాకులము గల్గుటచే బహువిధముల కృష్ణస్వామిని వెదకునట్టి రాధనుగూర్చి చెలికత్తె రసికముగా నిట్లు పలికెను.

---

# తృతీయాష్టపదీ ప్రారమ్భః

(వసంత రాగేణ గీయతే)

పల్లవి॥ విహరతి హరిరిహ సరసవసంతే-నృత్యతియువతిజనేన సమం-సఖి
విరహిజనస్య దురంతే॥ విహరతి॥

౧॥ లలిత లవఙ్గ లతాపరిశీలన-కోమల మలయసమీరే। మధుకరనికర
కరంబిత కోకిల-కూజిత కుంజకుటీరే॥ విహరతి॥

౨॥ ఉన్మద మదన-మనోరథ పథిక-వధూజన జనితవిలాపే। అళికుల
సంకుల-కుసుమసమూహా-నిరాకుల వకుళకలాపే॥ విహరతి॥

౩॥ మదన మహీపతి - కనకదండరుచి - కేసరకుసుమ వికాసే। మిళి
తశిలీముఖ-పాటల పటల-కృతస్మరతూణ విలాసే॥ విహరతి॥

౪॥ మృగమదసౌరభ-రభసవశంవద - నవదళ మాలతమాలే। యువ
జన హృదయ-విదారణమనసిజ-నఖరుచి కింశుకజాలే॥ విహరతి॥

౫॥ విగళితలజ్జిత - జగదవలోకన - తరుణ కరుణ కృతహాసే - విరహి
నికృన్తన-కున్తముఖాకృతి- కేతకిదంతురితాశే॥ విహరతి॥

౬॥ మాధవికా పరిమళ - మిళితేనవమల్లికయాతి సుగంధౌ। ముని
మన సామపి-మోహనకారిణి-తరుణాకారణబంధౌ॥ విహరతి॥

౭॥ స్ఫురదతిముక్త లతాపరిరంభణ-ముకుళితపులకితచూతే- బృన్దావన
విపినేపరిసర-పరిగతజ-యమునాజలపూతే॥ విహరతి॥

౮॥ శ్రీజయదేవభణిత-మిదముదయతి-హరిచరణ స్మృతిసారమ్ సరస
వసంతసమయ-వనవర్ణన-మనుగత మదనవికారమ్॥ విహరతి॥

తా॥ ఓ రాధా! విరహిణీ తరుణులు భరింపలేని సరస వసంతమున శ్రీ కృష్ణస్వామి! స్త్రీసమూహముతో క్రీడించుచు, నాట్యమును జేయు చున్నాడు. (1) సుందరములైన లవంగపు తీవలయొక్క స్పర్శల



వలన కోమలమైన మలయ మారుతము గలిగినట్టిన్ని, తుమ్మెదల తోడ కూడుకొనియున్న కోవెలల యొక్క ధ్వనులతో గూడిన పొదలనెడి కుటీరములతో గూడినట్టిన్ని యీవసంతమున విరహిణి తరుణులతో శ్రీకృష్ణస్వామి క్రీడించు చున్నాడు. (2) ఎక్కువగా మదించిన మన్మథ సంబంధమయిన కోరికలు గలిగిన విటవిటీ జనముయొక్క విచారములు గలగినదియును, తుమ్మెదల గుంపుచేత వ్యాపింప బడియున్న పుష్పసముదాయముచేత వ్యాకులమై యున్న పొగడ చెట్టుయొక్క సమూహము గలిగినదియును, అను వసంతమున విరహిణీ తరుణులతో శ్రీకృష్ణస్వామి క్రీడించు చున్నాడు. (3) మన్మథుడను మహీపతి యొక్క స్వర్ణదండము గల ఛత్రము యొక్క కాంతివంటి కాంతి గలిగిన నాగకేసర పుష్పములయొక్క విలాసము గలిగినదియును తుమ్మెదలనెడిబాణములు గలిగిన మన్మథుని యమ్ముల పొదులోయనం దగిన గలిగొట్టు పూవులయొక్క విలాసము గలిగినదియును, అగువసంతమున శ్రీకృష్ణభగవానుడు స్త్రీలతో క్రీడించు చున్నాడు. (4) కస్తూరి యొక్క పరిమళముల వేగమునకు స్వాధీనమయిన చిగురుటాకుల పంక్తులు గలిగిన కానుగుచెట్లు గలిగినట్టిన్ని, యౌవన వంతుల యొక్క వక్షస్థలములను వగుల్చునట్టి మన్మథుని గోళ్ల కాంతివంటి కాంతిగలిగిన మోదుగు పుష్పముల సమూహము గలట్టిన్ని, వసంతమున కృష్ణమూర్తి కాంతలతో క్రీడించు చున్నాడు. (5) పోగొట్టబడిన సిగ్గుగలిగిన లోకమును చూచుట వలన స్థూలమైన కరుణ పుష్పములనెడి చిరునవ్వు గలిగినట్టిన్ని, విరహులను భేదించుట యందు ఈటెలను బోలిన మొగలి పుష్పములచేత వ్యాపింపం బడిన దిక్కులు గలిగినట్టియు, అగు వసంతమున శ్రీకృష్ణమూర్తి స్త్రీలతో క్రీడించు చున్నాడు. (6) పుష్పించిన బాడి గురిగింజ

తీగెల యొక్క వాసనలతోఁ గూడుకున్నట్టియు, క్రొత్తమొల్లలచేత మిక్కిలి పరిమళింపుచున్నట్టియు, మునుల మనస్సులకు మోహము గలిగించునట్టియు, వయోవంతులకు అకారణ బంధువైనట్టియు, అగువసంతమున శ్రీకృష్ణమూర్తి స్త్రీలతోఁ గ్రీడించుచున్నాడు. (7) పుష్పించియున్న బండిగురుగింజ తీగెలయొక్క ఆలింగము చేసికొనుటచేత ముకుళితమనెడి రోమాంచము గలిగిన మామిడిచెట్టు గలిగిన వసంత ఋతువునందు పరిసరములను ప్రవహించుచున్న యమునానదీ జలముచేత పరిశుద్ధమైన బృందావనమునందు శ్రీకృష్ణమూర్తి స్త్రీలతోఁ గ్రీడించుచున్నాడు. (8) శృంగార రసయుక్తమైన వసంతకాల వర్ణనము గలిగినట్టిన్ని శ్రీకృష్ణమూర్తి యొక్క పాదముల ధ్యానము నందలి సారముగలిగినట్టిన్ని, అనుసరింపఁ బడిన మన్మథవికారములు గల్గినట్టిన్ని, అగు జయదేవ కవిచేఁ జెప్పబడిన ఈగీతము ప్రకాశింపుచున్నది. "ఓ రాధా! విరహిణీజనములు భరింపలేని యీవసంతము నందు తరుణీజనముతోఁ గూడి శ్రీకృష్ణస్వామి, క్రీడింపుచు, నాట్యము చేయుచున్నాడు.

శ్లో॥ దర విదళిత మల్లీవల్లి చఞ్చత్పరాగ
ప్రకటిత పటవాసై ర్వాసయన్ కాననాని
ఇహ హి దహతి చేతః కేతకీగన్ధ బన్ధుః
ప్రసరదసమ బాణ ప్రాణవ ద్గంధవాహః॥ ౭

ఉ॥ సల్లలిత ప్రిమల్లిక, ర ♦ జః పటవాస విలాస సౌరభం
బెల్లెడ గప్పుచున్నవి, వ ♦ నేందిరకున్ జిగిగూర్చి కేతకీ
వెల్లితగంధ మిత్రమయి ♦ వేమఱు మారుని ప్రాణరూపమౌ
చల్లని గాలి యుల్లమును ♦ జాలఁ దపింపఁగఁ జేయు నియ్యెడన్.



తా॥ మొగలిపూ తావికి బంధువై యింతకంత వికసించిన మల్లెపుష్పొడుతోఁ బ్రసిద్ధములైన పరిమళ ద్రవ్యములు గలిగి యడవులను వాసన గొట్టునట్టు జేయునట్టియును, సర్వత్ర వ్యాపించిన మన్మథునకుఁ బ్రాణసమానమైనట్టియును, అగు మలయమారుతము వసంతకాలమున మనస్సులను గాల్చుచున్నది.

శ్లో. ఉన్మీలన్మధుగంధ లుబ్ధ మధుపవ్యాధూతచూతాఙ్కుర
క్రీడత్కోకిల కాకలీ కలకలై రుద్గీర్ణకర్ణజ్వరాః
నీయన్తే పథికైః కథం కథ మపి ధ్యానావధానక్షణ
ప్రాప్త ప్రాణసమా సమాగమ రసోల్లాసైరమీ వాసరాః॥ ౮

శా॥ ప్రోద్యోద్యన్మధు గంధ లుబ్ధ మధు ప ♦ వ్యాధూత చూతాంకుర
క్రీడత్కోకిల కాకలీ కలల స ♦ ద్గీర్ణోరు కర్ణ జ్వరం
బై డంబారుట పాంథపాళి గడుపన్ ♦ ధ్యానావధానక్షణా
ప్రీడ ప్రాణ సమాన మీలితర సా ♦ ప్తి గాంత యీయామినిన్.

తా॥ పుట్టుచున్న తేనెయొక్క వాసనపై యాసక్తిగలిగిన తుమ్మెదలచేత కదలించబడిన మామిడి చిగుళ్ళయందు క్రీడింపుచున్న కోవెలల యొక్క మధురధ్వనుల కోలాహలముల చేత బయలువెళ్ళుచున్నట్టి చెవులయొక్క, తాపముగలిగినట్టి యీ వసంతకాల దినములు, అవధాన నేర్పుచేత పొందబడినట్టి ప్రియురాండ్రయొక్క సంభోగరసముచే కూడిన సంతోషముచేతను, అధిక ప్రయాసము తోడను విటులచేఁ గడుపఁబడుచున్నవి.

శ్లో॥ అనేకనారీ పరిరంభసంభ్రమ । స్ఫురన్మనోహారి విలాసలాలసమ్
మురారిమారాదుపదర్శయన్త్యసౌ । సఖీసమక్షం పునరాహ రాధికామ్॥

తే॥ తన పురోభాగమున సొగ ♦ సైన యబహుళ
కామినీ జన పరిరంభ ♦ కాముఁడైన
గోపికానాథు గన్గొని ♦ తాపమునను
మఱియుఁ బల్కెను రాధతో ♦ మందయాన.

తా. ఈచెలికత్తె, సమీపమందును, ఎదుటను, అనేకస్త్రీల యాలిఁగన మండలి త్వరచేత ప్రకాశించునట్టి శ్రీకృష్ణుని చూచుచున్నదై, రాధతో మఱల నిట్లనియెను.

---

## చతుర్థాష్టపదీప్రారమ్భః.

(రామప్రియా రాగేణ గీయతే.)

పల్లవి॥ హరిరిహ ముగ్ధవధూనికరే-విలాసిని విలసతి కేళిపరే

౧. చందనచర్చిత నీలకళేబర-పీతవసన వనమాలీ। కేళిచలన్మణి కుణ్డలమండిత-గణ్డయుగ స్మితశాలీ ॥హరిరిహ॥

౨. పీనపయోధర భారభరేణ - హరింపరిరభ్య సరాగమ్। గోపవధూ రనుగాయతి కాచిత్-ఉదంచిత పంచమ రాగమ్ ॥హరిరిహ॥

౩. కాపివిలాస విలోచనఖేలన-హరింజనిత మనోజమ్। ధ్యాయతి ముగ్ధ వధూరధికమ్ - మధుసూదన వదనసరోజమ్ ॥హరిరిహ॥

౪. కాపి కపోల తలేమిళితా - లపితుం కిమపిశ్రుతిమూలే। చారుచుచుంబ నితంబవతీ - దయితం పులకై రనుకూలే ॥హరిరిహ॥

౫. కేళి కలా కుతుకేన కాచి-దముం యమునావన కూలే - మంజుళ వంజుళ కుంజగతం విచ-కర్ష కరేణ దుకూలే ॥హరిరిహ॥

౬. కరతలతాళతరళ వలయావళి - కలిత కలస్వన వంశే। రాసరసేనృత్య పరా-హరిణాయువతీ ప్రశశంసే ॥హరిరిహ॥

౭. శ్లిష్యతి కామపి చుంబతి కామపి - రమయతి కామపి రామామ్। పశ్యతిసస్మితచారుతరామపరా-మనుగచ్ఛతివామామ్॥హరిరిహ॥

౮. శ్రీజయదేవభణిత మిదమద్భుత-కేశవకేళిరహస్యమ్। బృన్దావన విపినేచరితమ్-వితనోతుశుభానియశస్యమ్॥ హరిరిహ॥



తా॥ శృంగార భావజనిత లీలలుఁగల యోరాధా! క్రీడయె యుత్కృష్టముగాఁ గోరిన ముగ్ధలతో శ్రీకృష్ణమూర్తి విహరించుచున్నాఁడు. (1) శ్రీగంధముచేతఁ బూయఁబడిన, నల్లనిదేహమునందు పచ్చని బట్టయును వనమాలలును గలిగినట్టియు, క్రీడలచే కదలుచున్న రత్నకుండలములచేత నలంకరింపఁబడిన కపోలయుగ్మము గలిగినట్టియు, చిరునవ్వుచేత నొప్పుచున్నట్టి శ్రీకృష్ణభగవానుఁడు, యీ వసంతరుతువునందు ముగ్ధవెలఁదులతో విహరించుచున్నాఁడు. (2) ఒక గొల్లపడుచు, ప్రకాశింపఁజేయు పంచమరాగమును పాడుచున్న శ్రీకృష్ణమూర్తిని, తనయొక్క బలిసిన భారములగు కుచములయొక్క యనురాగముతోఁ గూడుకొన్నట్లు కౌఁగలించుకొని కూడ పాడుచున్నది. (3) ఒకానొక గొల్లపడుచు, లీలలుచేత చంచలములైన కన్నులయొక్క క్రీడలచేత పుట్టింపఁబడిన మన్మథవికారము గలిగిన శ్రీకృష్ణుని వదనాబ్జమును యెక్కువగా ధ్యానించుచున్నది. (4) ఒకానొక గొల్లభామ, చెవులదగ్గఱ నేమో రహస్యపల్కు బల్కుటకు బోవుదానివలె వెళ్ళి, రోమాంచములచేత దట్టమైన శ్రీకృష్ణమూర్తియొక్క గండస్థలమునందు మోవిని విడువక ప్రియుని సుందరముగా ముద్దుబెట్టుకొనెను. (5) ఒకానొక స్త్రీ మన్మథ క్రీడలయందలి కుతూహలముచేత యమునానదీతీరమునందున్న సుందరములైన వకుళవృక్షముయొక్క పొదను పొందియున్న యీ కృష్ణమూర్తిని తన హస్తముతో యతని దుకూలమునుబట్టి లాగెను. (6) ఒకానొక యౌవనవతి, కరకంకణముల మంజులధ్వనులతోడ, కరములను తాళములు చఱచుచు, మధురధ్వనులలో గూడిన పిల్లనగ్రోవియొక్క సుస్వరమును గలిగిన రాసక్రీడారసమునందలి నాట్యాసక్తులై శ్రీకృష్ణభగవానునిచే నుతింపఁబడిన దాయెను. (రాసక్రీడయనఁగా) నడుమ

నొక పురుషుఁడును, యీ సలావల నొక్కొక్క స్త్రీయు నీలాగున స్త్రీ పురుషులు మండలాకారముగా నాట్యముచేయుట.) (7) శ్రీకృష్ణమూర్తి ఒకానొక స్త్రీని కౌగలించుకొను చున్నాఁడు. మఱియొక స్త్రీని ముద్దుబెట్టుకొనుచున్నాఁడు. మఱియొక స్త్రీని రమించుచున్నాఁడు. మఱియొక స్త్రీని చిరునవ్వుతో కూడునట్లుగా సుందర వీక్షణముల బరుపుచున్నాఁడు. సౌందర్యవతియైన మఱియొక స్త్రీని వెంబడించి పోవుచున్నాఁడు. (8) బృందావనమనెడి యడవియందు ఆచరింపఁబడినట్టిన్ని, కీర్తికరమైనట్టిన్ని, ఆశ్చర్యకరములైన శ్రీకృష్ణమూర్తి క్రీడలయొక్క రహస్యములు గలిగినట్టిన్ని, శ్రీజయదేవకవిచేఁ జెప్పబడినట్టిన్ని అగు యీ ప్రబంధము శుభములను విస్తరింపజేయు గాక

శ్లో॥ విశ్వేషామనురంజనేన జనయన్నానంద మిందీవర
శ్రేణీశ్యామల కోమలై రుపనయన్నంగై రనంగోత్సవమ్
స్వచ్ఛందం వ్రజసుందరీ భిరభితః ప్రత్యఙ్గమాలిఙ్గితః
శృఙ్గారస్సఖిమూర్తి మానివమధౌ ముగ్ధోహరిః క్రీడతి॥ ౧౧

ఉ॥ సర్వజనాను రంజనము ♦ చాలఁగఁ జేయుచు మేచకాంబుజో
ద్గర్వజితాంశుఁడై సురత ♦ కార్యసుఖాప్తి వ్రజాంగనాళితోఁ
బర్వశశాంక వక్త్రిఁడిల ♦ బాలకుఁడైనను ధీరనాథుఁడై
శర్వరియందుఁ గృష్ణుఁడు వ ♦ సంతమున న్విహరించునే చెలీ.

తా॥ ఓరాధా! సంతోష పెట్టుటచేత సమస్తజనుల కానందమును పుట్టించుచున్నట్టి నల్లకలువ యొక్క సమూహమువలె, నల్లనైనట్టిన్ని కోమలములైనట్టిన్ని, అవయవములచేతను మన్మథోత్సవమును బొందించుచున్నట్టియు, యథేచ్ఛగా గోపికా స్త్రీలచేత నంతటను ప్రత్యవయవము చేతను ఆలింగనముఁ జేయబడినట్టిన్ని, అగు శరీరముతో గూడిన శృంగార రసమువలెనున్నట్టి మనోహరుఁడైన శ్రీకృష్ణస్వామి వసంతకాలము నందు క్రీడించుచున్నాఁడు.



శ్లో॥ అద్యోత్సఙ్గవసద్భుజ ఙ్గకబళ క్లేశాదివేశాచలం
ప్రాలేయప్లవనేచ్ఛయాను సరతి శ్రీఖండశైలానిలః
కించిత్స్నిగ్ధరసాలమౌళి ముకుళాన్యాలోక్య హర్షోదయా
దున్మీలంతి కుహూః కుహూరితి కలోత్తాలాపికానాం గిరః॥ ౧౨

శా॥ లీలోత్సంగ వసద్భుజంగ కబళక్లే ♦ శాక్తి చే హైమవ
త్ప్రాలేయ ప్లవనేచ్ఛ, బోవుగతిఁజే ♦ రన్ సాగె శ్రీఖండశై
లాలోలానిల మామ్రమౌళిముకుళ ♦ వ్యాలోకహర్షాప్తిను
న్మీలించెన్పికముల్ కుహూయనురవో ♦ న్మేషన్ గలోత్తాలమై.

తా॥ ఓరాధా! ఈవసంతకాలము నందు మలయమారుతము, సమీపమునందున్నట్టి పాములు మేయుటవలన గలిగిన యాయాసముచేతనే మోయను నట్లు మంచునందు తాపము దీఱుననెడి యిచ్ఛవలన హిమవత్పర్వతమును గూర్చి పోవుచున్నది. ఇంచుకంత సున్నమైన మామిడి చెట్లయొక్క యగ్రభాగము లందలి మొగ్గలను వీక్షించి, సంతోషము యొక్క కలిమిచేత "కుహూ కుహూ" యనెడి కోకిలల యొక్క కూతలు వృద్ధిఁజెందు చున్నవి.

ఇతి శ్రీజయదేవ కృతౌ గీతగోవిన్దే మహాకావ్యే
ప్రథమస్సర్గః.

---

# శ్రీగీతగోవిందే ద్వితీయస్సర్గః

శ్లో॥ విహరతి వనే రాధా సాధారణప్రణయే హరౌ
విగళితనిజోత్కర్షా దీర్ష్యావశేన గతాన్యతః
క్వచిదపి లతాకుఞ్జే గుంజన్మధువ్రతమణ్డలీ
ముఖరశిఖరే లీనా దీనాప్యువాచ రహస్సఖీం॥ ౧౩

చ॥ సవతులు నన్నుఁ జూచియొక ♦ సక్కెములాడఁగఁ గృష్ణుఁడివ్వడా
యువతులతోడఁ గూడెనని ♦ యుల్లము ఝల్లన రాధ క్రుద్ధయై
జవమున బోయి యొక్క తటి ♦ షట్పదఝుంకృతులుల్లసిల్ల మా
ధవలతికాని కుంజమున ♦ దాగినదై సఖితోడ నిట్లనెన్.

తా॥ శ్రీకృష్ణస్వామి సర్వసాధారణమైన స్నేహము గలవాఁడై యందరితోడను వనమున గ్రీడించుటచే తనగొప్ప పోయినదని అసూయఁజెంది మఱియొక దిక్కును పొందినదై, ఝుంకారములు చేయు తుమ్మెదల గుంపుతో శబ్దింపుచున్న కొనలు గలిగిన పొదరింటి యందొకానొక చోట, అణిగినట్టిన్ని దీనయైనట్టిన్ని, అగు రాధ, ఏకాంతముగాఁ జెలికత్తెతో యిట్లు చెప్పెను.

---

# పంచమాష్టపదీప్రారమ్భః.

(తోడిరాగేణ గీయతే)

పల్లవి॥ రాసేహరిమిహవిహితవిలాసమ్-స్మరతి మనో మమకృతపరిహాసం
౧ సఞ్చలదధర సుధామధురధ్వని - ముఖరితమోహనవంశం చలిత
దృగఞ్చల మోహనమౌళి - కపోలవిలోలవతంసమ్ ॥ రాసే॥
౨. చంద్రకచారుమయూరశిఖణ్డ - మణ్డలవలయితకేశం| ప్రచురపురం
దర ధనురనురఞ్జిత- మేదురముదిరసువేషం ॥రాసే॥
3. గోపకదంబనితంబవతీముఖ- చుంబనలంబితలోభం
బంధుజీవమధురాధరపల్లవ_కలితదరస్మితశోభం ॥రాసే॥
౪. విపుల పులక భుజ పల్లవ వలయిత - పల్లవ యువతి సహస్రమ్
కరచరణోరసి మణిగణ భూషణ-కిరణ విభిన్న తమిస్రం ॥రాసే॥



౫. మణిమయ మకర మనోహర కుణ్డల - మణ్డిత గండ ముదారమ్
పీతవసన మనుగత మనుజ - సురాసురవర పరివారం ॥ రాసే॥
౬. విశద కదంబ తలే మిళితం కలి-కలుష భయం శమ యంతం
మామపి కిమపితరంగదనంగ - దృశావపుషారమయన్తం ॥రాసే॥
౭. జలద పటల చల దిందు వినిందక - చందన బిందు లలాటం పీన
పయోధర పరిసర మర్దన - నిర్దయ హృదయ కవాటం ॥ రాసే॥
౮. శ్రీజయదేవ పణితమతి సుందర - మోహన మధురిపు రూపమ్
హరిచరణస్మరణం ప్రతి - సంప్రతిపుణ్యవతామనురూపమ్ ॥రాసే॥

తా॥ ఓ చెలీ! రాసక్రీడల యందు, లీలలు చేయునట్టిన్ని, పరిహాసము చేయునట్టిన్ని, శ్రీకృష్ణస్వామిని, నామనస్సు యీ పొదరింటి యందు స్మరింపుచున్నది. (1) అధరామృతము నందు చలించుచున్న శ్రావ్యమై ధ్వనితోడ మ్రోగుచున్న మోహనమైన మురళిని ధరించిన వాఁడును, కదలుచున్న చూపుల కొనలు గలిగిన వాఁడును, కదలుచున్న కిరీటము గలవాఁడును, గండస్థలముల యందు చలింపుచున్న కర్ణభూషణములు గలవాఁడును, అగు శ్రీ కృష్ణమూర్తిని నామనస్సు యీ పొదరింటియందు స్మరింపుచున్నది. (2) మేచకములచేత నొప్పుచున్నట్టి నెమళ్లపింఛముల యొక్క సమూహముచేతఁ జుట్టఁబడిన కేశములు గలిగినట్టిన్ని, విస్తారమయిన యింద్రధనుస్సులచేత నలంకరింపబడిన నీలమేఘమువంటి మంచివేషము గలిగినట్టిన్ని, అగు శ్రీకృష్ణస్వామిని నామనస్సు యీ పొదరింటి స్మరింపుచున్నది. (3) గొల్లభామల మోములను ముద్దుపెట్టుటయందు ప్రాప్తమైన యనురాగము గలిగినట్టిన్ని, మంకెనపూవును బోలిన సుందరమైన చిగురువంటి మోవియందు కూడిన మందహాసము యొక్క కాంతి గలిగినట్టిన్ని, అగు శ్రీకృష్ణభగవానుని నామనస్సు

యీ పొదరింటియందు స్మరింపుచున్నది. (4) విపులములైన పులకలతోఁ గూడిన బాహువల్లములచేతఁ జుట్టబడిన గొల్ల పడుచుల యొక్క సహస్ర కరచరణ వక్షస్థలములందు, రత్నసమూహములు గలిగిన భూషణముల యొక్క కిరణముల చేత పోగొట్టఁబడిన చీకటిగలిగినట్టి శ్రీమురహరిని నామనస్సు యిచట స్మరింపు చున్నది. (5) రత్నమయములైన మొసళ్ళవలె మనోహరములై యొప్పుచున్న కర్ణభూషణముల చేత నలంకరింపఁబడిన చెక్కిళ్ళు గలిగినట్టిన్ని, గంభీరుఁడైనట్టిన్ని, పీతాంబరముగలిగినట్టిన్ని, ముని, మనుజ సురాసురలు పరివారములుగా గలిగినట్టిన్ని అగు శ్రీమురళీమోహనుని నా మనస్సు యీ పొదరింటియందు స్మరింపుచున్నది. (6) నిర్మలమైన కడపచెట్లయొక్క ప్రదేశమునందు జేరియున్నట్టిన్ని, కలియుగపు పాపభీతిని పోఁగొట్టుచున్నట్టిన్ని, ఇంచుకంత చలింపుచున్న మన్మథోద్దీపక దృష్టిగల మనస్సుచేత నన్నును రంజింపఁ జేయునట్టిన్ని, అగు శ్రీగిరిధరుని నా మనస్సు యీ పొదరింటియందు స్మరింపుచున్నది. (7) మేఘసమూహమునందు చలింపుచున్న చంద్రుని ధిక్కరించుచున్నట్టి శ్రీగంధపు తిలకము గలిగిన లలాటముతో నొప్పుచున్నట్టిన్ని, బలిసిన స్తనములయొక్క పరిసరమునందు మర్దించుటయందు దయలేని తలుపువంటి డెందముగల్గినట్టిన్ని, అగు శ్రీనరహరిని నా మనస్సు యీ పొదరింటియందు స్మరింపుచున్నది. (8) మిక్కిలి చక్కనైనదియు, మోహకరమైనదియు, అగు శ్రీకృష్ణభగవానుని స్వరూపము గలిగిన శ్రీజయదేవకవిచేతఁ జెప్పబడిన యీ గీతము పుణ్యపురుషులకు శ్రీకృష్ణ పాదధ్యానమును గూర్చి యిరువు యోగ్యమైనది. రాసక్రీడా స్థలమునందు చేయఁబడిన క్రీడగలిగిన శ్రీహరిని నామనస్సు స్మరింపుచున్నది.



శ్లో॥ గణయతిగుణగ్రామం భ్రామం భ్రమాదపి నేహతే
వహతిచపరితోషం రోషం విముఞ్చతి దూరతః
యువతిషు వలత్తృష్ణే కృష్ణే విహారిణి మాంవినా ౧౪
పునరపి మనోవామం కామం కరోతి కరోమికిం॥

చ॥ లలనరో నామనంబు కుటి ♦ లంబయి నన్నుఁడబాసి యన్యకాం
తల రతిఁగోరు కృష్ణుపయిఁ ♦ దప్పని ప్రేమవహించి వానియం
జ్జ్వలతర చారుచర్యలను ♦ సారెకునెంచుచు సంచలింపకున్
జలమును జెందకన్ ముదముఁ ♦ జాలఁగఁబొందెడి నేమిసేయుదున్.

తా॥ ఓ చెలీ! నామనస్సు కుటిలమైనదై, నన్నువిడచి క్రీడింపుచున్నట్టియు, ఇతర స్త్రీలయందు వృద్ధినిబొందుచున్న యాశను గలిగినట్టియు శ్రీకృష్ణస్వామియందు తిరిగి యభిలాషను చేయుచున్నది. ఆతని గుణములను తలంచుచున్నది. ఆ తలంపునుండి కదలికను భ్రమ వల్లనైనను కోరదు. సంతసమును పొందుచున్నది. కోపమును దూరముగా విడుచు చున్నది. నే నేమి సేయుదును?

---

# షష్టాష్టపదీప్రారమ్భః.

(కాంభోజి రాగేణ గీయతే.)

పల్లవి॥ సఖి కేశిమథన ముదారం - రమయ మయా సహమదన మనోరథ భావితయా సవికారమ్.

౧ నిభృత నికుఞ్జ గృహం గతయా - నిశి రహసి నిలీయ వసన్తం
చకిత విలోకిత సకల దిశా రతి-రభస వశేన హసన్తం ॥సఖి॥

౨ ప్రథమ సమాగమ లజ్జితయా పటు - చాటు శతైరనుకూలమ్
మృదు మధు రస్మిత భాషితయా-శిథిలీకృత జఘనదుకూలమ్॥సఖి॥

3. కిసలయ శయన నివేశితయా చిర - మురసి మమైవ శయానమ్
కృతపరి రంభన చుంబనయా - పరిరభ్య కృతాధర పానమ్ ||సఖి||

౪. అలస నిమీలిత లోచనయా-పులకావలి లలిత కపోలం
శ్రమజలసకల కళేబరయా-వరమదన మదా దతి లోలమ్ ||సఖి||

౫. కోకిల కలరవ కూజితయా - జిత మనసిజ తంత్ర విచారమ్
శ్లథ కుసుమాకుల కుంతలయా-నఖలిఖిత ఘన స్తన భారమ్||సఖి||

౬. రతిసుఖ సమయ రసాలసయా-దరముకుళిత నయన సరోజమ్
నిస్సహ నిపతిత తనులతయా-మధుసూదన ముదిత మనోజమ్||సఖి||

౭. చరణ రణిత మణి నూపురయా-పరిపూరిత సురత వితానమ్
ముఖర విశృఙ్ఖల మేఖలయా-సకచగ్రహ చుంబన దానమ్ ||సఖి||

౮. శ్రీజయదేవ భణిత మిద మతిశయ-మధురిపు నిధువన శీలమ్
సుఖ ముత్కంఠిత రాధికయా-కథితం వితనోతు సలీలమ్ ||సఖి||

తా|| ఓ చెలీ! కేశినియను రాక్షసుని వధించిన శ్రీకృష్ణస్వామీ! కామ క్రీడాభిలాషముచేత సంభావితురాలనైన నాతో గూడ వివిధ కామచేష్టలతో గూడునట్లు క్రీడింపఁజేయుము. (1) నిశ్శబ్దమైన పొదరింట నున్న నాతో గూడ రాత్రియందే కాంము సందణఁగి యున్నట్టిన్ని, భయము వలన చూడఁబడిన యెల్లదిక్కులు, గలిగిన నాతోడ క్రీడలయొక్క సంతోషము కొఱకు ఆధీనమగుట చేత నవ్వుచున్నట్టిన్ని, అగు శ్రీకృష్ణస్వామిని రమింపఁ జేయుము. (2) ఓ చెలీ! ప్రథమ సమాగమున సిగ్గుపడియున్న నాతోడ వశీకరణ సమర్థులైన చతురోక్తులు పలుకుచు, అనుకూలుఁడైనట్టిన్ని, మృదు మధురములైన చిరునవ్వుతో గూడిన పలుకులు గలిగిన నాతోడ, వదలింపబడిన మొలయందు గల పట్టు వలువ గలిగినట్టిన్ని, అగు కృష్ణమూర్తిని రమింపజేయుము. (3) ఓ చెలీ!



చివుళ్ళపాన్పుపై కూర్చున్న నాతో, తడవుగా నా వక్షస్థలము నందే యుండుకొని యున్నట్టిన్ని, ఆలింగనమందు ముద్దులు గల నన్ను కౌగలించుకొని అధరామృతమును గ్రోలుచున్నట్టిన్ని, అగు శ్రీకృష్ణస్వామిని రమింపఁ జేయుము. (4) ఓ చెలీ! మెల్లగా మూయబడిన కన్నులుగల నాతోడ పులకాంకురముల చేత మనోహరముగా నేర్పడిన కపోలములు గలవాఁడున్ను, చెమట సర్వదేహమునందును గలనాతోడ శ్రేష్ఠమైన మన్మథ సంబంధ సంతోషము వలన మిక్కిలి యాశతో గూడియున్నట్టిన్ని, అగు శ్రీకృష్ణభగవానుని రమింపఁజేయుము. (5) ఓసఖీ! కోవెలల యొక్క అవ్యక్త మధుర ధ్వనివంటి పలుకును గలిగిన నాతోడ జయింపఁబడిన కామశాస్త్ర విచారము గలవాడున్ను, కొప్పువీడుట చేత చెదరిన కుసుమములతో కదలుచున్న ముంగురులు గల నాతోడ, గోళ్ళ చేత నాటింపఁబడిన గొప్పలైన కుచభారముగలిగినవాఁడును, అగు శ్రీకృష్ణస్వామిని గ్రీడింపజేయుము. (6) ఓ చెలియా! రతి సుఖ సమయము నందలి అనురాగముచేత అలసిన నాతోడ యించుకంత మూయఁబడిన తామరరేకులవంటి కన్నులు గల్గినట్టిన్ని శ్రమచేత దుర్బలమై తూలునట్టి కోమలమైన శరీరముగల నాతోడ మన్మథక్రీడ గలిగినట్టిన్ని అగు మధుసూదనుని గ్రీడింపజేయుము. (7) ఓ చెలీ! పాదములయందు మ్రోగుచున్న రత్నఖచితములైన యందెలుగల నాతోడ పరిపూర్ణ సురతక్రీడలు గలిగినట్టిన్ని, మ్రోగుచున్న దృఢమైన మొలనూలుగల నాతోడ కొప్పువట్టికొని ఆధర చుంబనము మాటి మాటికిని జేయునట్టిన్ని, అగు శ్రీకృష్ణమూర్తిని రమింపఁజేయుము. (8) శ్రీ జయదేవ కవిచేత జెప్పబడినదియును, అధికముగా శ్రీకృష్ణుని శృంగార చరితములే స్వాభావముగా గలిగినదియును, రాధచేత విలాసముతో గూడిన

యాసక్తిని శేషములు పలుకఁబడినదియును, అగు నీ గీతము సౌఖ్యమును విస్తరింపఁ జేయుఁగాక.

శ్లో॥ హస్తస్రస్త విలాసవంశ మనృజు భ్రూవల్లి మద్వల్లవీ
బృందోత్సారి దృగన్త వీక్షితమతి స్వేదార్ద్ర గణ్డస్థలమ్
మాముద్వీక్ష్య విలజ్జిత స్మితసుధా ముగ్ధాననం కాననే
గోవింద వ్రజసుందరీ పరివృతం పశ్యామి హృష్యామి చ॥ ౧౫

శా॥ నాళీకానన దివ్యలోచనల స ♦ న్నాళీక పత్రార్చితుం
గేళీజాతనిదాఘ సార్ద్రమకరీ ♦ కేళీ కపోలున్ సుకం
కేళీకుంజ గళత్సువేణు నిరతీ ♦ కేళీ విలోలన్ ననున్
హేలం జూచి హసించు కృష్ణునిల స ♦ ద్ధేళీ ప్రభుం జూచెదన్.

తా॥ వనమునందు హస్తమునుండి విలాసముగా జారిన పిల్లనగ్రోవి గలిగినట్టిన్ని, కుటిలమైన కనుబొమ్మలు గలిగిన గోపికా సమూహము యొక్క సంతోషమును బొందిన మొనచూపుల చేతఁ జూడఁబడు నట్టిన్ని, అధికమైన చెమటచేతఁ దడసిన చెక్కిళ్ళుగల నన్నుచూచి సిగ్గుపడు నట్టిన్ని, మందహాసామృతము చేత మనోహరమైనట్టి ముఖము గలిగినట్టిన్ని, గోపికా స్త్రీలచే పరివృతుండైనట్టిన్ని, అగు గోవిందుని చూచుచు సంతోషపడు చున్నాను.

శ్లో॥ దురాలోక స్తోక స్తబక నవకాశోక లతికా
వికాసః కాసారో పవనపవనోఽప్యస్మి వ్యథయతి
అపి భ్రామ్య ద్భృఙ్గీ రణిత రమణీయా సముకుళ
ప్రసూతి శ్చూతానాం సఖి శిఖరిణీయం సుఖయతి॥ ౧౬

చ॥ సలలిత వంజుల ప్రసవ ♦ సౌరభ మేదుర మంద మారుతం
బల సహకార కోరక భ ♦ వాద్భుత దివ్యమరంద బిందుసం
వల నను గ్రోలి ఝుమ్మనెడు ♦ క్రొవ్విన తేఁటులు నుల్లసిల్లఁదా
రిలస్మర సాహచర్యమున ♦ నేచుచునుండెడిఁ జూడవే సఖీ.



తా॥ ఓ చెలీ! చూచుటకు శక్యముగాని కొంచెములైన పూవుగుత్తులచేఁ నూతనములైన యశోక వృక్షముల యొక్కయు, తీగల యొక్కయు, వికాసమును గల యీసరస్సునందు గల యుద్యాన వనము నందలి వాయువు బాధింపుచున్నది. ఇంతేకాదు, తిరుగుచున్న ఆడుతుమ్మెదల యొక్క ఝుంకారము చేత నొప్పుచున్న మొనలు గల యీ మామిడి చెట్ల యొక్క మొగ్గల గుంపు సుఖ మిచ్చుట లేదు.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
ద్వితీయస్సర్గః.

# గీతగోవిన్దే తృతీయస్సర్గః.

శ్లో॥ కంసారి రపి సంసారి వాసనా బద్ధశృఙ్ఖలామ్
రాధామాదాయ హృదయే తత్యాజ వ్రజసుందరీః॥ ౧౭

తే॥ గీ॥ వరుఁడు సంసార వాసనా ♦ బద్ధశృంఖ
లాకృతిని రాధనెంచి మ ♦ ద్గాళివదలి
యమున పొంతనం దందుతా ♦ నరసి, మదన
శర ప్రణార్తి మాధవుఁ డిట్లు ♦ సారె వనుచు.

తా॥ శ్రీకృష్ణుఁడును సంసారము నందలి పూర్వజన్మ వాసన చేతఁ గట్టఁబడిన యాసక్తియను సంకెళ్లు కలిగి రాధను మనసునందుంచుకొని గోపస్త్రీలను విడిచెను.

శ్లో॥ ఇతస్తతస్తా మనుసృత్య రాధికా
మనఙ్గబాణ వ్రణఖిన్న మానసః
కృతానుతాప స్స కళింద నందినీ
తటాన్తకుఞ్జే విషసాద మాధవః॥ ౧౮

సీ॥ కల్ప పాదప కాంతు ♦ గల్గుభృంగము మాడ్కి
వల్ల వీలతికల ♦ నెల్లమాని
నవ వసంతాగమ ♦ నము గోరు పికమన
గల నాగవేణువై ♦ ఖరిఘటించి
దవ వహ్ని పొదలవే ♦ ధవహించు హరిమాడ్కి
స్మరఘోర శరపరం ♦ పరలఁజిక్కి
పెన్నిధి గోల్పడి ♦ వెదకు మానవు మాడ్కిఁ
దరుణిఁ గోల్పడిబోధ ♦ దరులఁ ద్రొక్కి
తే॥ గీ॥ భృంగ కంజాబ్జ చక్రప్ర ♦ భంగవిభ్ర
మాభ్ర సైకత కదళి కూ ♦ ర్మాబ్జలలిత
యమున రమణీ మణినిజెంత ♦ నమర ద్రావయ
వలపు తలకెక్కి మరుతంత్రి ♦ తలఁచిపొక్కు.

తా॥ ఈవలాచల రాధను వెదకి మారుని శరములచేత గాయపడిన క్లేశముతోఁ గూడిన మనస్సు గల్గినట్టిన్ని, పశ్చాత్తాపము గలిగినట్టిన్ని, ఆ కృష్ణస్వామి యమునానదీ తటమునందుఁ గల పొదరింట యందు విచారపడెను.

# సప్తమాష్టపదీ ప్రారంభః.

(భూపాళ రాగేణ గీయతే)

పల్లవి॥ హరిహరి హతాదరతయా సాగతా కుపితేవ॥
౧. మామియం చలితా విలోక్య! వధూ నిచయేన
సాపరాధ తయా మయాపి నవారితాతి భయేన ॥హరిహరి॥
౨. కిం కరిష్యతి కిం వదిష్యతి। సాచిరం విరహేణ
కింజనేన ధనేన కిం మమ-భూషణేన గృహేణ ॥హరిహరి॥



3. చింతయామి తదాననం! కుటిలభ్రు కోప భరేణ
శోణపద్మమి వో పరిభ్రమతా! కులంభ్రమరేణ ॥హరిహరి॥
౪. తామహమ్ హృదిసంగయా! మనిశం భృశం రమయామి
కింవనేఽనుసరామి తామిహ! కింవృథా విలపామి ॥హరిహరి॥
౫. తన్వి ఖిన్న మసూయయా। హృదయం తవా కలయామి
తన్నవేద్మి కుతోగతాసి నతేనతేఽను నయామి ॥హరిహరి॥
౬. దృశ్యసేపురతోగతాగత! మేవ మేవి దధాసి
కిం పురేవ ససంభ్రమం-పరిరంభణం నదదాసి ॥హరిహరి॥
౭. క్షమ్యతామ పరం కదాపి - శవే దృశం నకరోమి దేహిసుందరి
దర్శనంమమ - మన్మథేన ధునోమి ॥హరిహరి॥
౮. వర్ణితం జయదేవకేన - హరే రిదంప్రవణేన తిందుబిల్వ సముద్ర
సంభవ - రోహిణీ రమణేన ॥హరిహరి॥

తా॥ (శ్రీకృష్ణమూర్తి పరితాపముతో యిట్లనుచున్నాడు.) "హరి హరీ! నావల ఆదరణ లేకుండుటవలన, ఆ రాధ, కోపించిన దానివలెనే పోయెను.''

(1) ఈరాధ, స్త్రీసమూహము వలనఁ జుట్టుకొనబడిన నన్ను విలోకించి కదలిపోయెను. అపరాధములతోఁ గూడియుండుటచేత మిక్కిలి భీతిగలిగిన నాచేత నడ్డగింపఁబడక పోయినది. (2) ఆ రాధా వియోగము వలన "ఏమి చేయుదును? ఏమి చెప్పుదును? నాకింక ఈ జనముల వలనను, ధనము వలనను, అలంకారములు వలనను, గృహము వలనను, ఏమిప్రయోజనము గలదు? (3) కోపాతిశయముచేత తిరుగుచున్న తుమ్మెదలనెడు కుటిలములైన కనుబొమలు గలిగిన, వ్యాకులమైన యెఱ్ఱతామర పువ్వనెడు దాని ముఖమును యిప్పుడు చింతించుచున్నాను. (4) మనస్సునందు వసించుచున్న ఆ రాధను నే నెల్లప్పుడును యెక్కువగా క్రీడింపుచున్నాను. వృథాగా నే నీ

వనమునందు దానినేల వెదుక వలయును? ఎందు కొఱకు దానిని గూర్చి విచారపడవలెను? (5) ఓ రాధా! నీ మనస్సు అసూయ చేత ఖేదమును బొందియున్న దానినిగా నే నెల్లప్పుడును తలంచు చున్నాను. వినయభావముచేత నీ కొఱకు మంచిమాటలాడు చున్నాను. అటువంటి నన్నే కారణము వలన విడిచి పోయితివో, ఆ కారణమును యెఱుఁగకున్నాను. (6) నాకు ముందర గనబడు చున్నావు వచ్చుచుఁ బోవుచునే యున్నదానవు. ఎందుచేత నీవు తొల్లిటివలె తొందరతోఁ గూడిన కౌగిలి నీయకున్నావు? (7) ఓ సుందరీ! ముందు చేసిన నా అపరాధము లన్నియు క్షమింపఁ బడును గాక! నీయందెప్పుడును యిటువంటి యపరాధమును జేయను. మరునిచేత పరితాపము నొంచుచున్నాను. నాకు నీ యొక్క దర్శనమును యిమ్మా! (8) శ్రీకృష్ణభగవానునకు సేవకుఁడై నట్టియు, తిందుబిల్వ గ్రామమనెడు "మహా సముద్రమునందు జన్మించి చంద్రునివంటి జయదేవ కవిచంద్రుని చేత యీ గీతము రచియింపఁ బడెను'

శ్లో॥ హృదిబిసలతాహారో నాయం భుజఙ్గమనాయకః
కువలయదళశ్రేణీ కంఠే న సా గరళద్యుతిః
మలయజరజో నేదం భస్మ ప్రియారహితే మయి
ప్రహర న హరభ్రాన్త్యానఙ్గ క్రుధా కిము ధావసి॥ ౧౯

చ॥ మలయజ రేణుపాళి బస ♦ మంబని, యుత్పల జాలకౌళిమన్
గళగరళంబటంచు, బిస ♦ కాండము లన్ ఫణిహార పాళియుం
చలతి సరోజ పత్రములు ♦ సైంచుపు డంచును, గాంచ గాంబరం
బల, పులి చర్మమంచు స్మర ♦ యూర్చకు నేహరినాముఁ జూడగన్.

తా॥ ఓయీ మన్మథా! నేను శివుఁడ ననుభ్రమ చేత కొట్టకుము. కోపముతో తఱుముకుము. హాఱొమ్మునందు గలవి తామర



తూండ్లుగాని సర్పములుగావు, నాకంఠము నందలివి నల్ల కలువ తేకులుగాని గరళ కాంతులుగావు. నాశరీరము మీఁదిది శ్రీగంధ రజముగాని విభూతికాదు. ప్రియురాలినెడ బాసియున్న నాయందు ఈశ్వర భ్రాంతిని వదలి నీబాణము నెక్కుపెట్టకుము.

శ్లో॥ పాణౌ మాకురు చూతసాయకమముం మాచాప మారోపయ
క్రీడానిర్జితవిశ్వ! మూర్చితజనాఘాతేన కింపౌరుషం
తస్యా ఏవ మృగీదృశో మనసిజ ప్రేఙ్ఖత్కటాక్షాశుగ
శ్రేణిజర్ఝరితం మనాగపి మనో నాద్యాపి సంధుక్షతే॥ ౨౦

శా॥ పాణిం జూతశరంబుఁ బట్టిధనువున్ ♦ వంచంగనేలా; తను
త్రాణా నిర్జిత విశ్వమూర్ఛిత విఘా ♦ తంబొప్పునే, నీరము
గ్వేణీదివ్య నిశాత తాంచితరుచి ♦ ప్రేంఖత్కటాక్షాశుగ
శ్రేణీ జర్ఝరితంబు నామనము పే ♦ ర్మింగాన, దీ వేళకున్.

తా॥ విలాసముచేత ప్రపంచమును జయించిన యో మన్మథుఁడా! నీహస్తమునందలి మామిడి చిగుళ్ళ బాణమును వింటియందెక్కు పెట్టకుము. మూర్ఛను బొందియున్న జనులను గొట్టుటయేమి పౌరుషము? లేడివంటి చూపులుగల రాధయొక్క, చలింపుచున్న కడగంటి చూపులనెడి బాణసమూహముల చేత నొవ్వబడిన నామనస్సు యిప్పటికైనను కొంచెమైనను స్వస్థపడలేదు.

శ్లో॥ భ్రూచాపే నిహితః కటాక్షవిశిఖో నిర్మాతు మర్మవ్యథామ్
శ్యామాత్మా కుటిలః కరోతు కబరీభారోపి మారోద్యమమ్
మోహం తావదయంచ తన్వితనుతాం బింబాధరో రాగవాన్
సద్వృత్తస్తన మణ్డలమ్ తవకథం ప్రాణైర్మమ క్రీడతి॥ ౨౧

శ్లో॥ తాని స్పర్శసుఖాని తేచ తరళా స్నిగ్ధాదృశోర్విభ్రమా
స్తద్వక్త్రాంబుజ సౌరభం సచసుధాస్యందీ గిరాంవక్రిమా
సాబింబాధర మాధురీతివిషయాసంగేఽపి చేన్మానసం
తస్యాం లగ్నసమాధిహన్త విరహవ్యాధిః కథం వర్తతే॥ ౨౨

శ్లో॥ భ్రూ పల్లవంధను రపాంగతరంగి తాని
బాణా గుణ శ్రవణ పాళి రితిస్మరేణ
తస్యా మనంగ జయ జంగమ దేవతాయా
మస్త్రాణినిర్జిత జగంతి కిమర్పితాని॥ ౨౩

సీ॥ పటుతర శ్యామాతి ♦ కుటిల కేశ భరంబు
మానక మారోద్య ♦ మము నొనర్ప
నీరరాగ ప్రభా ♦ భివ్యక్త బింబాధ
రంబు డంబెనఁగ మో ♦ హం బొనర్ప
సద్వృత్త నిర్జర ♦ స్తన మండలంబును
ఘోరమై నా మది ♦ నూరు చుండ
మార మంత్రోదార ♦ సార ప్రచార వి
స్తార వ్యాహారముల్ ♦ గారు కొనఁగ

తే॥ గీ॥ స్థిరను నిజజయ జంగమ ♦ దేవత గతిఁ
దనరు నీకను భ్రూచాప ♦ మును జగజ్జ
య ప్రబిరుదాంక చారు క ♦ టాక్ష శరము
లంగజుఁ డొసంగెనీక నోర్వ ♦ నగునె రాధ.

తా॥ ఓ రాధా! నీ కనుబొమలనెడి విండ్లయందు సంధించబడిన కడకంటి చూపులనెడి బాణములు నామర్మస్థానమునందు బాధను చేయునుగాక; కుటిలతయు నలుపును గల నీ కొప్పు మారణ ప్రయత్నమును జేయునుగాక; రక్తిమము గలిగిన నీ దొండపండు వంటి అధరము నన్ను యెక్కువగా మోహింపఁ జేయును గాక; నీ గుండ్రములైన కుచమండలము నా ప్రాణములదీయ నెట్లు యాడుచున్నవి? సద్వృత్తుఁడనఁగా సదాచారము గలవాఁడు. అట్టి వానికి ప్రాణహింసఁ జేయుట ధర్మమా? "స్వర్గాసుఖములకు సమానమైన నీ చంచలములైనట్టివిన్ని, మనోహరములైనట్టివిన్ని,



అగు దృగ్విలాసములు. అటువంటివేయైన నీముఖ కమలము యొక్క పరిమళములు. అట్టివే నీ యమృతమును గురియునట్టి వక్రోక్తులు అట్టిదే నీ దొండపండువంటి అధరముయొక్క మధురిమము." ఇట్లని విషయముల యొక్క కూటమియందు మనసు లగ్నమయ్యెనా! ఆరాధను గూర్చిన వియోగము వలన గల్గిన మనోవ్యాధి యెట్లువర్తించును? "కనుబొమలనెడి చిగుళ్ళు గలిగిన విల్లును, కడగంటి వీక్షణ పరంపరలనెడి బాణములున్ను, చెవులనెడి చిహ్నము గలిగిన యల్లెత్రాడున్ను, గలిగి లోకములను జయించిన బాణములు, ఈ రాధయనెడి మన్మథ జయ సంబంధిని యగు జంగమ పరదేవతా రూపిణి యందుంచబడినవేమో?"

శ్లో॥ యమునాతీర వానీర నికుంజే మందమాస్థితమ్
ప్రాహ ప్రేమభరోద్భ్రాంతం మాధవం రాధికాసఖీ॥ ౨౪

తే॥ గీ॥ లలిత యామున వానీర ♦ కలిత కుంజ
నిలయుఁడై ప్రేమభీతులఁ ♦ గలఁగియున్న
జలజనేత్రునిఁ గనుఁగొని ♦ నిలచి యెదుటఁ
బలికె రాధిక పంపిన ♦ చెలియ యపుడు.

తా॥ (పైవిధముగా దలపోయుచు) యమునా తీరమందలి ప్రబ్బలి చెట్ల యొక్క పొదరింటి యందున్నట్టియు, ప్రేమచేతను పూర్వ కృతాపరాధము వల్ల గలిగిన భయముచేతను భ్రమసియున్నట్టియు, అగు శ్రీకృష్ణస్వామిని గూర్చి, రాధయొక్క చెలికత్తె మెల్లగా నిట్లు పలికెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
తృతీయస్సర్గః.

---

# చతుర్థస్సర్గః

## అష్టమాష్టపదీ ప్రారంభః

(సౌరాష్ట్రీ) రాగేణ గీయతే)

పల్లవి॥ సావిరహే తవ దీనా కృష్ణ-సావిరహే తవ దీనా మానన మన
సిజ విశిఖభయాదివ-భావనయా త్వయిలీనా ॥సావిర॥

౧॥ నిందతిచందన మిందు కిరణ మను విందతి ఖేద మధీరం
వ్యాళనిలయ మిళనేన గరళ మవకలయతి మలయసమీరం ॥సావిర॥

౨॥ అవిరళ నిపతిత మదన శరాదివ భవదవనాయ విశాలం
స్వహృదయ మర్మణి వర్మకరోతి సజల నళినీ దళజాలం ॥సావిర॥

3॥ కుసుమవిశిఖ శరతల్ప మనల్ప-విలాస కళా కమనీయం
వ్రతమివ తవ పరిరంభ సుఖాయ-కరోతి కుసుమ శయనీయం॥సావిర॥

౪॥ వహతిచ గళిత విలోచన జలధర-మానన కమల ముదారం
విధు మివ వికట విధుంతుదదంత-దళన,గళితామృత ధారం॥సావిర॥

౫॥ విలిఖతి రహసి కురంగమదేన భవంతమసమ శర భూతం
ప్రణమతి మకరమధో వినిధాయ కరేచ శరం నవచూతం॥సావిర॥

౬॥ ప్రతి పదమిదమపి నగదతి మాధవ-తవచరణే పతితాహం
త్వయి విముఖే మయినపది సుధానిధి-రపితనుతే తను దాహం

7॥ ధ్యాన లయేన పురఃపరికల్ప్య-భవంతమతీవ దురాపం
విలపతి హసతి విషాదతి రోదతి-భ్రమతి విముంచతి తాపం ॥సావిర॥

౮॥ శ్రీజయదేవ భణిత మిద మధికం-యది మనసా నటనీయం
హరి విరహాకుల వల్లవ యువతీ-సఖీ వచనం పఠనీయం ॥సావిర॥

తా. ఓ కృష్ణస్వామీ! మరుచరములచే నైన భీతివలన వలెనే తలంపు
చేత నీయందు లీనమయిన యీ రాధ నీ వియోగము వలన దీను



రాలై నది, (1) దుఃఖమును పొందుచున్నది. మలయమారుతమును, సర్పముల యొక్క నిలయమగు మలయ పర్వతమునుండి వచ్చుట వలన విషమువలెనే తలంచుచున్నది. చల్లదనమునిచ్చు చందనమును, చంద్రకిరణములను నిందించుచున్నది(2) ఆ రాధ, విడువకుండా పడుచున్న మదనుని బాణములనుండి, తనహృదయమందు నివసించియున్న నిన్ను రక్షించుటకొఱకో;యనునట్లు విశాలములైన జలములతోఁగూడిన తామర తేకులసమూహమునుతన హృదయము యొక్క జీవస్థానమందు కవచమువలె ధరించుచున్నది. (3) ఆ రాధ, మన్మథునియొక్క యమ్ముల పాన్పువలెనున్నట్టి పువ్వుల మీఁద అధికమైన శృంగార కళలచేత నొప్పుచున్నట్టి నీ యొక్క ఆలింగన సుఖముకొఱకు వ్రతముచేయు దానివలె నున్నది. అనఁగా యిష్టార్థసిద్ధికై చేయు వ్రతమువలె నిన్ను ధ్యానించుచున్నది. (4) ఆ రాధ, కాఱుచున్న కన్నీటిని గలిగిన సుందరమైనట్టి ముఖకమలమును, విరోధియైన, రాహువుయొక్క దంతపు కాటువలన కాఱుచుండిన అమృత ధారలు గలిగిన చంద్రునివలె వహించుచున్నది.(5)ఆరాధ,యేకాంతమందుకస్తూరిచేతమన్మథసమానుఁడవైన నిన్ను వ్రాయుచున్నది. ఆ తరువాత మకరధ్వజము వలె మకరరేఖలును, హస్తమందు బాణములవలె క్రొత్తమామిడి చిగురును, రచియించి మ్రొక్కుచున్నది. (6) ఆ రాధ, "ఓ మాధవా! నేను నీ పాదములందు బడిన దానను; నీవు నాయందు విముఖత్వమును జూపుట వలన, యిప్పుడు చంద్రుఁడు నాయందు పరితాపమును విస్తరింపజేయుచున్నాఁడు," అను యీ వచనములను పదే పదే పలుకుచున్నది. (7) ఆ రాధ మిక్కిలి పొందుటకు వీలు కాని నిన్ను యేకాగ్రచిత్తముతోఁడి ధ్యానముచేత నీ మూర్తిని తన యెదుట కల్పించుకొని, విచారపడుచున్నది. ఖేదమునొందు

చున్నది. రోదనము చేయుచున్నది, తిరుగుచున్నది. పరితాపమును బయలువఱచుచున్నది. (8) మనస్సుచేత సంతోషపడవలయును నేని, శ్రీజయదేవకవిచేత చెప్పఁబడిన యీ హరి విరహవేదనచే వ్యాకులత్వమును జెందిన రాధ యొక్క చెలికత్తె వాక్యము పఠింపఁదగినది.

శ్లో॥ ఆవాసో విపినాయతే ప్రియసఖీమాలాపి జాలాయతే
తాపో నిశ్వసితేన దావదహనజ్వాలా కలాపాయతే
సాపి త్వద్విరహేణ హంతహరిణీ రూపాయతే హాకథమ్
కందర్పోపి యమాయతే విరచయన్ శార్దూలవిక్రీడితమ్॥ ౨౫

శా॥ ఆవాసంబును నాళులన్ నిబిడ తా ♦ పా వా ప్తియున్ శ్వాసమున్
భావోద్ధూత చరిత్రమున్ గనసుదా ♦ వంబై కనజ్జాలమై
దావంబై ఘనవాతమై భయకరో ♦ ‡చ్ఛార్దూల విక్రీడితంబై
విప్పారఁగ జింకనా నడలెని ♦ న్న జ్జాతీతాఁ బాయుటన్.

తా॥ ఓ శ్రీకృష్ణా! నీ యొక్క వియోగముచేత, నివాసగృహము అడవిగాను, ప్రియరాండ్రైన చెలికత్తెల సమూహము వలవలెను, నిట్టూర్పుచేత, శరీరతాపమును కార్చిచ్చు మంటలవలెను, భయంకరము గలిగి యున్నది. ఆ రాధ, జింకవలె కృశించిన యాకృతి గల్గి యున్నది. కటకటా మన్మథుఁడును పెద్దపులివలె విలాసమును జూపువాఁడై యమునివలె నాచరింపుచున్నాఁడు. ఆహా యిఁక నెట్లోకదా!

## నవమాష్టపదీప్రారమ్భః.

(దేశాక్షరీ రాగేణ గీయతే.)

వల్లవి॥ రాధికా కృష్ణ రాధికా-రాధికా విరహే తవ కేశవ.

౧॥ స్తన వినిహిత మపి హార ముదారం
సామనుతే కృశ తనురివ భారమ్ ॥రాధికా॥

‡ పద్యముయొక్క పేరు సరియైన అర్థములో ధ్వనింపుచున్నది.



౨॥ స్వసిత పవనమను పమ పరిణాహం
మదన దహనమివ వహతి సదాహం ॥రాధికా॥

3॥ సరస మసృణ మపి మలయజ పంకమ్
పశ్యతి విషమివ వపుషి సశంకమ్ ॥రాధికా॥

౪॥ దిశిదిశి కిరతి సజల కణ జాలమ్
నయన నళిన మివ విగళిత నాళమ్ ॥రాధికా॥

౫॥ నయన విషయమివ కిసలయ తల్పమ్
కలయతి విహిత హుతాశన కల్పమ్ ॥రాధికా॥

౬॥ త్యజతి న పాణి తలేన కపోలమ్
బాల శశినమివ సాయ మలోలమ్ ॥రాధికా॥

౭॥ హరిరితి హరిరితి జపతి సకామమ్
విరహ విహిత మరణేన నికామమ్ ॥రాధికా॥

౮॥ శ్రీజయదేవభణిత మితిగీతమ్
సుఖయతు కేశవపద ముపనీతమ్ ॥రాధికా॥

॥ (రాధాకృష్ణా! నీవియోగము చేత) కృశించిన శరీరము గల యీ రాధ స్తనములయందు ధరియించిన యమూల్యమైన ముత్యాల హారమును కూడ భారముగాఁ దలఁపోయుచున్నది. (౨) సరిలేని విశాలమైన నిట్టూర్పు వాయువు ఉష్ణసహితమై మన్మథాగ్నివలె వహింపుచున్నది. (3) శరీరమునందుఁ బూయఁబడిన ద్రవసహితమైన మృదుల మగు శ్రీగంధపు పూతను గూడ కాలకూట విషమువలె సందేహముతోఁ జూచుచున్నది. (4) నీటి బిందు సమూహముతోఁ గూడి యున్నట్టియు, తీడిన తొడిమగల్గినట్టియు, తామర పువ్వువంటి నేత్రములను ప్రతి దిక్కునందును బరపుచున్నది. (5) దృష్టిగోచరమైన చిగురుటాకుల పాన్పును వియోగజనులకు విహితమైన అగ్నితో సమానమైన దానివల్లనే

తలంచుచున్నది. (6) సాయంకాలమందు కదలకయున్న బాల చంద్రునివలె నున్నట్టి గండస్థలము నందలి చేతిని తీయదు (చెక్కిటఁ జేయిఁ జేర్చి చింతించుచున్నది.) ‡(7) వియోగమువలన గలిగిన మరణభావము చేత కోరికలతోఁ గూడినదై "హరి హరీ" అని మిగుల జపించుచున్నది. (8) ఓజనులారా! ఈవిధముగా శ్రీకృష్ణచరణములనుఁ గూర్చి, సమర్పింపఁ బడిన శ్రీజయదేవ కవిచే చెప్పఁబడిన యీగీతము సేవకుల సుఖింపఁ జేయునుగాక.

శ్లో॥ స్మరాతురాం దైవతవైద్య హృద్య
త్వదంగ సంగా మృతమాత్ర సాధ్యామ్
నివృత్తబాధాం కురుషే న రాధా
ముపేన్ద్రవజ్రా దపి దారుణోసి. ౧౬

ఉపేంద్రవజ్రము॥ అపారదస్రాభ త్వదంగ సంగ స
త్కృపాసు ధాసాధ్య రతీశ బాధం
దపించు రాధన్ దయఁడాయు వేని
† న్నుపేంద్ర వజ్రాగ్రత నోర్తు వెన్నన్.

తా॥ అశ్వనీ దేవతలవలె మనోహరుఁడవైన ఓ శ్రీకృష్ణా! మన్మధుని చేత పీడితురాలై నీయంగ కూటమియనెడు యమృతము చేతను మాత్రమే సాధింపఁబడు మేలుగల యీరాధను మన్మథ పీడ యనెడి బాధనుండి విముక్తురాలినిగా చేయకుంటి వేని. వజ్రాయుధము కంటె భయంకరమైన వాఁడవగు చున్నావు.

‡ మరణావస్థను పొందిన వారు పరలోక ప్రాప్తికై హరినామ స్మరణ చేయుట వలె అను అర్థ చమత్కారమును. వ్యంగ్యము గాగలదు. మరణ భావమనగా ఇది వ్యభిచారి భావములలో సంచారీభావముగా వర్ణింపఁ బడునది.

† ఈ పద్యనామము పద్యములో భావార్థముగా నున్నది.



శ్లో॥ కందర్పజ్వర సంజ్వరాకులతనో రాశ్చర్య మస్యాశ్చిరం
చేతశ్చందన చంద్రమః కమలినీ చింతాసు సంతామ్యతీ
కింతుక్లాన్తివశేన శీతలతరం త్వామేక మేవప్రియమ్
ధ్యాయంతీ రహసిస్థితం కథమపి క్షీణాక్షణంప్రాణితి॥ ౧౭

ఉ॥ చందన చంద్రకంజముల • సారెఁదలంచి తపించునింతి, మా
నందన సంజ్వరాకులమ • నంబుననుండెడి నిన్ను నొక్కనిన్
జందన శీతలుండని, వె • సందల పోయుచుఁ గార్శ్యమందియుం
గందువనే క్షణంబైనఁ • గాంచును జీవము నబ్బురంబుగాన్

తా॥ మన్మథ జ్వరతాపము చేత వ్యాకులమైన శరీరము గలిగిన యీరాధ యొక్క మనస్సు శ్రీగంధము యొక్కయు, చంద్రుని యొక్కయు, కమలముల యొక్కయు, శైత్యోపచారముల స్మరణలయందే చిరకాలమును బరితాప మొందుచున్నది. కృష్ణా! ఆశ్చర్యమేమని చెప్పుదును! బడలికచే అధీనురాలై ఏకాంతమునందున్న ప్రియుఁడవైన నిన్నొక్కనిని మాత్రమే చల్లనివానిగా స్మరింపుచున్నదై కృశురాలైన దైనను అది ప్రయత్నముతో క్షణకాలము బ్రతుకుచున్నది. సుమా!

శ్లో॥ క్షణమపి విరహః పురా న సేహే
నయన నిమీలిత ఖిన్నయా తయాతే
శ్వసతి కథ మసౌ రసాలశాఖామ్
చిరవిరహేణ విలోక్య పుష్పితాగ్రాం॥ ౧౮

పుష్పితాగ్రావృత్తము॥ కణమైనన్ విరహంబు నోర్వలేమిం
గనుఁ గవ మూసితపించు, నింతె యేలా
గున,ఁ గను సురసాల పుష్పితాగ్రం
బును, జిరవిరహార్తిఁ దేలు వేళన్.

తా॥ పూర్వకాలమందు నీవియోగము, కన్నుల యొక్క నిమీలితము
చేత ఖిన్నురాలైన యారాధ చేత క్షణకాలమైనను క్షమింపఁ
బడదు. ఈరాధ చిరకాల వియోగముచేత పుష్పించిన కొనలు
గలిగిన తియ్యమామిడి చెట్లుయొక్క కొమ్మలనుఁ జూచి యెట్లు
జీవనము నిలుపుకొనునో? తలంపుము.

శ్లో॥ అహమిహ నివసామి యాహి రాధా
మనునయ మద్వచనేన చానయేథాః॥
ఇతి మధురిపుణా సఖీ నియుక్తా
స్వయమిదమేత్య పునర్జగాద రాధామ్॥ ౨౮

గీ॥ "సఖియ యిందుండెద నను,నీవు ♦ చని, వధూటి
తోడ నామాటలను జెప్పి, ♦ తోడి తేవె"
యనుచుఁ గృష్ణుండు పంపఁగా ♦ నపుడు వచ్చి,
మరియుఁ బల్కెను రాధతో ♦ సరసిజాక్షి.

తా॥ (చెలికత్తె వచనంబులువిని శ్రీకృష్ణుఁడిట్లను చున్నాఁడు.) "నేనీ
పొదరింటె యందుండెదను. నీవు పోయి యారాధను యారడిం
చుము. నావాక్యములుగా చెప్పి పిలుచుకొనిరమ్ము." అని యిట్లు
కృష్ణస్వామిచేత యాజ్ఞాపించఁ బడినదై చెలికత్తె మరలివచ్చి
రాధతో యిట్లుపలికెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిన్దే మహాకావ్యే
చతుర్థస్సర్గః.

# పంచమస్సర్గః.

దశమాష్టపదీ ప్రారమ్భః.
(ఆనందభైరవి రాగేణ గీయతే.)

పల్లవి॥ తవవిరహే వనమాలీ సఖి సీదతి రాధే ॥తవ విరహే॥

౧॥ వహతి మలయసమీరే మదన ముపనిధాయ
స్ఫుటతి కుసుమ నికరే విరహి హృదయ దళనాయ ॥తవ విరహే॥



౨॥ దహతి శిశిరమయూఖే మరణమను కరోతి
పతతి మదన విశిఖే విలపతి వికలీకరోతి ॥తవవిరహే॥

౩॥ ధ్వనతి మధుపసమూహే శ్రవణమపి దధాతి
మనసి చలిత విరహే నిశినిశిరుజ ముపయాతి ॥తవవిరహే॥

౪॥ వసతి విపిన వితానే త్యజతి లలితధామ లుఠతి ధరణి శయనే
బహువిలపతి తవనామ ॥తవవిరహే॥

౫॥ రణతి పిక సమవాయే ప్రతిదిశ మనుయాతి హసతిమనుజ నిచయే
విరహ మపలపతి నేతి ॥తవవిరహే॥

౬॥ స్ఫురతి కలరవరావే స్మరతి మణితమేవ తవరతి సుఖవిభవే
గణయతి సుగుణమతీవ ॥తవవిరహే॥

౭॥ త్వదభిధ శుభదమాసం వదతి నరశృణోతి తమపి జపతి సరసం
యువతిషు నరతి ముపైతి ॥తవవిరహే॥

౮॥ భణతికవిజయదేవే విరహ విలసితేన మనసి రభసవిభవే హరిరుద
యతు సుకృతేన ॥తవవిరహే॥

తా॥ సఖీ! రాధా! వనమాలియగు శ్రీకృష్ణమూర్తి నీ వియోగము
వలన. బాధపడు చున్నాడు. (1) ఓ రాధా! మలయమారుతము
మన్మథుని సహాయము చేసికొని వీచుచుండఁగా, పుష్పసమూ
హము వియోగుల హృదయములను వ్రక్కలించుటకొఱకై వికసింపు
చుండఁగా, శ్రీకృష్ణస్వామి నీ యెడబాటువలన కలిగిన బాధను
పొందుచున్నాడు. (2) శీతమయూఖుండగు చంద్రుఁ డుదహింపు
చుండగా ప్రాణత్యాగమును అనుసరింపు చున్నాఁడు, మన్మథ
బాణములు పడుచుండఁగా, విచారపడుచున్నాఁడు. కళారహితుఁ
డగుచున్నాఁడు. (3) తుమ్మెదలగుంపు ఝంకారము జేయు
చుండఁగా, చెవులను మూసికొను చున్నాఁడు, మనస్సునందతి
శయించిన, విరహముగు చుండఁగా, ప్రతిరాత్రియందును ఉపతాప

మును బొందుచున్నాఁడు. (4) అరణ్యములలో నివసించు చున్నాఁడు, రమణీయమైన గృహమును విడిచిపెట్టుచున్నాఁడు, భూశయ్యయందు బొర్లుచున్నాఁడు. నీయొక్క పేరును బహు విధములుగా, ఉచ్చరింపుచున్నాఁడు. (5) కోవెలల యొక్క సమూహము కూయుచుండగా, (ఆధ్వనిని వినజాలక) ప్రతి దిక్కునకుఁ బరువెత్తు చున్నాఁడు, (అట్టి తన్నుజూచి) "నిష్కారణముగాఁ బరుగులిడుచున్నా" డని మనుష్యులు నవ్వఁగా, ఇది విరహము కాదని దాఁగుచున్నాఁడు. (6) పావురములయొక్క ధ్వని వెలయుచుండఁగా నీ రతిసారమును స్మరింపుచున్నాఁడు, నీయొక్క రతి క్రీడాసుఖము వలన గలిగిన వైభవము నందలి మంచిగుణమును అధికముగా యెంచుచున్నాఁడు. (7) ‡ నీయొక్క నామధేయము గలిగి మంగళప్రదమైన యీ వైశాఖమాసమును మనుష్యులు చెప్పుచుండఁగా వినుచున్నాఁడు ఆ రాధాఖ్యమాసమునున్న అనురాగముతో గూడు కొన్నట్టుగా జపించుచున్నాఁడు, ఇతర స్త్రీల యందాసక్తిని పొందక యున్నాఁడు. (8) కవియైన జయదేవుఁడు విరహచేష్టలతోడఁ జెప్పుచుండగా వినెడివారి పుణ్యపరిపాకము చేత సంతోషాధిక్యమును గలిగిన, మనుజుల మనస్సునందు శ్రీహరి సాక్షాత్కరించును గాక!

శ్లో॥ పూర్వంయుత్ర సమం త్వయారతి పతేరాసాది తాస్సిద్ధయ
స్తస్మిన్నేవని కుంజ మన్మథ మహాతీర్థే పునర్మాధవః
ధ్యాయన్స్త్వామనిశం జపన్నపితవై వాలాపమంత్రావళిం
భూయస్త్వత్కుచ కుంభనిర్భర పరీరంభామృతం వాంఛతి॥ 30

‡ వైశాఖేమాధవో రాధః అని నిఘంటువునందు గలదు. ఇది శుభమిచ్చు మాసము.



మ॥ మును నీతోఁ బతియెందు, మారుని రతుల్ ♦ భోగించెనో, యల్ల
నూతన కంజాంగజ దివ్యతీర్థమునఁ గాం ♦ తా యిప్పుడుం జేరి,
నిన్ననయంబెన్నుచుఁ దా జపించుభవదీ ♦ యాలాప మంత్రాళిమై
రను తాత్వత్కుచకుంభ నిర్భరవరీ ♦ రంభామృతే చ్ఛారతిన్॥

తా॥ పూర్వము నీతో యే పొదరింటియందు మన్మథ కార్యసిద్ధులనుభవింపఁబడినవో, ఆ పొదరిల్లనెడి మన్మథ మహాక్షేత్రమందు శ్రీకృష్ణస్వామి నిన్ను మరల స్మరింపుచు, సదా నీ సంభాషణములనెడి మంత్రాళిని జపించుచు, నీ కలశములవంటి స్తనములయొక్క యధికమైన యాలింగనమనెడి సుధారసంబును మిక్కిలి కోరుచున్నాడు.

---

## ఏకాదశాష్టపదీప్రారమ్భః.

(తోడి రాగేణ గీయతే.)

పల్లవి॥ ధీర సమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ
గోపీపీన పయోధ రమర్ధన చంచలకరయుగశాలీ ॥ధీరసమీరే॥
౧॥ రతిసుఖ సారే గత మభిసారే మదనమనోహర వేషమ్
నకురు నితంబిని గమనవిళంబన మనుసర తం హృదయేశమ్ ॥ధీర॥
౨॥ నామసమేతం కృతసఙ్కేతం వాదయతే మృదువేణుం
బహుమనుతేన నుతేతనుసఙ్గత పవనచలిత మపిరేణుం ॥ధీర॥
౩॥ పతతిపతత్రే విచలతి పత్రే శంకిత భవదుపయానం
రచయతి శయనం సచకితనయనం పశ్యతిత పపంథానం ॥ధీర॥
౪॥ ముఖరమధీరంత్య జమఞ్జీరం రిపు మివ కేళిషులోలా
చలసఖి కుంజంసతి మిరపుంజం శీలయనీలనిచోళం ॥ధీరసమీరే॥

౫॥ ఉరసిమురారే-రుపహితహారే-ఘనఇవ తరళబలాకే
తటిదివపీతే-రతివిపరీతే - రాజసిసుకృత విపాకే ॥ధీరసమీరే॥
౬॥ విగళితవసనం-పరిహృతరశనం-ఘటయతిఘనమపిధానం
కిసలయశయనే-పంకజనయనే-నిధిమివహర్షనిధానం ॥ధీరసమీరే॥
౭॥ హరిరభిమానీ - రజనీరిదానీ - మియముపయాతివిరామం
కురుమమవచనం-సత్వరరచనం-పూరయమధురిపుకామం ॥ధీర॥
౮॥ శ్రీజయదేవే - కృతహరిసేవే - భణతిపరమరమణీయం
ప్రముదితహృదయం-హరిమతిసదయం-నమతసుకృతకమనీయం ॥ధీ॥

తా॥ మనోహరమైన వాయువుగల యమునానదీ తీరమునందలి వనమందు గోపికలయొక్క బలిసిన స్తనములను మర్ధించుట యందు కదలుచున్న హస్తద్వయముచేత నొప్పుచున్న వాఁడై వనమాలి యున్నాఁడు. (1) ఓ రాధా! క్రీడాసుఖము యొక్క సారమును గలిగిన సంకేతస్థాన మందున్నట్టిన్ని, మదనునివలె సుందరమైన యలంకారము గలిగినట్టిన్ని, నీ ప్రాణేశుఁడైనట్టిన్ని, అగు, ఆ వనమాలిని గూర్చి పొమ్ము, పోవుటయందు విళంబనము చేయకుము. (2) పేరుఁతో గూడుకొన్నట్టుగాఁ జేయఁబడిన సంగేతస్థలము గలిగిన శ్రవణసుఖరమైన వేణువునూదుచున్నాఁడు, ఓ రాధా! నీ శరీరమందు తగిలిన వాయువుచేత కదలింపఁబడిన పరాగమునుకూడా బహుమానింపు చున్నాఁడు. (3) పక్షులు ఱెక్కలను విదల్చునప్పుడును, చెట్లయాకులు కదలునప్పుడును, సంశయింపఁబడిన నీరాకగా నూహించి పానుపు వేయుచున్నాఁడు, భీతితోఁ గూడిన చూపులతో నీవు వచ్చెడి త్రోవను తిలకించుచున్నాఁడు. (4) ఓ సఖియా! శృంగారచేష్టలయందు మ్రోగునట్టివియుఁ గదలునట్టివియు, అగు నీపాద మంజీరములను పగవానివలె నెంచి అధీరంగా విడువుమా! కటికచీకటితోఁ గూడియున్న



పొదనుగూర్చి పొమ్ము; నల్లనిచీరను గట్టుకొని పొమ్మా! (5) ఓ కనకాంగీ! నీవు పుణ్యఫలరూపమైన ఉపరతియందు పొందఁబడిన ముత్యాలహారములు గల శ్రీకృష్ణభగవానుని వక్షస్థలము నందలి కొంగలతో గూడిన మేఘమునందలి మెఱుపువలె ప్రకాశింతువు. (6) ఓ పంకజనేత్రీ! విడువబడిన వస్త్రముగలిగినట్టిన్ని, పరిహరింపఁబడిన మొలనూలు గలిగినట్టిన్ని, ఆచ్ఛాదన రహితమైనట్టిన్ని, నీ పిఱుదులను చిగురుటాకుల పాన్పుపై సంతోషమునకాదికారణమైన నిక్షేపమువలె, జేర్చుమా! (7) ఓ రాధా! శ్రీకృష్ణుఁడు నీయందభిమానము గలఁవాడు. ఇప్పుడీ రాత్రి విరామమును బొందుచున్నది. త్వరతోఁగూడిన చేతలుగలదానవై నావాక్యాను సారముగా చేయుము, మధురిపుని కోరికలను దీర్చుము. (8) ఓ జనులారా! చేయఁబడిన శ్రీకృష్ణ సేవగలిగిన, శ్రీజయదేవకవి మిక్కిలి మనోహరముగా పల్కుచుండఁగా, సంతసపడు మానసముగలిగి నట్టియు, అత్యంత ప్రేమతో కూడుకొన్నట్టియు, పుణ్యములవలనఁ గోరదగినట్టియు, శ్రీకృష్ణభగవానుని గూర్చి నమస్కరింపుడు.

శ్లో॥ సామాంద్రక్ష్యతి వక్ష్యతిస్మరకథాః ప్రత్యంగమాలింగనైః
ప్రీతిం యాస్యతి రంస్యతేసఖి సమాగత్యేతి చింతాకులః
సత్వాంపశ్యతి వేపథేపులకయ త్యానందతి స్వేదతి
ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతమః పుంజే నికుంజే స్థితః ౩౧

సీ॥ ఎలనాగ ప్రియముతో ♦ నిదెవచ్చెడి నటంచు
గడఁగి సారెకుముందు ♦ నడచినడచి
వచ్చి నమ్మోహంబు ♦ వారఁ జూచునటంచు
సొలపుతో నిన్నెదు ♦ ర్చూచిచూచి
చూచినాతోఁ గథ ♦ లొప్పలయఁ బల్కునటంచుఁ
బొందు గగ్గురపాటు ♦ నొందియొంది

పల్కి నాతోఁ గేళి ♦ పరిఢవిల్లు నటంచు
ముదమునఁ బులకలు ♦ పూనిపూని

తే॥ స్థిరతమః పుంజ మగుకుంజ ♦ సీమసీదు
వరుఁడు చింతాకులత నున్న ♦ వాఁడు,నీదు
మోము, తనగోము, నాదునో ♦ మునవరవియు
నిరులు నరులును, నెరయ జా ♦ గింకఁదగునె.

తా॥ ఓ సఖియా! ఆ కృష్ణస్వామి, దట్టమైన చీఁకటి సమూహముగల పొదరింటి యందున్నవాఁడై "ఆరాధవచ్చి నన్ను చూచును; మన్మథ కథలను గూర్చి పలుకును; సర్వావయవముల యందును కౌగిలి చేత సంతోషమును పొందించును, క్రీడించును." ఇట్లని చింతాకుల స్వాంతుఁడై సన్నెదురు చూచుచున్నాడు. వణకుచున్నాఁడు, గగ్గురుపాటును పొందు చున్నాఁడు, సంతోష పడుచున్నాఁడు చెమట లొందుచున్నాఁడు, ఎదురుగా వచ్చుచున్నాఁడు, మూర్ఛిల్లుచున్నాఁడు.

శ్లో॥ వికిరతి ముహుర్శ్వాసాశ్వాసాన్పురో ముహురీక్షతే
ప్రవిశతి ముహుః కుంజంగుంజన్ముహుర్బహుతామ్యతి
రచయతిముహుశ్శయ్యాం పర్యాకులం ముహురీక్షతే
మదన కదన క్లాన్తః కాంతే ప్రియస్తవ వర్తతే. ౩౨

ఉ॥ మాటికి వెచ్చనూర్చుచును ♦ మాటికి దిక్కులఁ జూచివేచుచున్
మాటికి సంతపించుచును ♦ మాటికిఁ దాఁబొదరిల్లుఁ జేరుచున్
మాటికి శయ్యఁ జేయుచును ♦ మాటికి నాకుల పాటునొందు,నో
బోటి విహంగ ఘోటిమరు ♦ ఘోటికి ధాటికి నాఁటినాఁటికిన్

తా॥ ఓ కాంతా! నీమనోహరుఁడు ముక్కుల నుండి నిట్టూర్పులను పలుమారు నెరవుచున్నాడు, ముందరవైపు మాటిమాటికి చూచుచున్నాఁడు, పలుమారు పొదరింటిలో ప్రవేశింపుచున్నాఁడు, పలుమారు మిక్కిలి తపించుచున్నాఁడు, పలుమారు పాన్పును పరచుచున్నాఁడు, వ్యాకులముతో పలుమారు చూచుచున్నాఁడు మన్మథ యుద్ధము వలన పీడితుఁడై అలసట జెందియున్నాఁడు.



శ్లో॥ త్వద్వామ్యేనసమం సమగ్రమధునా తిగ్మాంశుర స్తంగతః
గోవిందస్య మనోరథేనచ సమం ప్రాప్తం తమస్సాంద్రతాం
కోకానాం కరుణస్వనేన సదృశీ దీర్ఘా మదభ్యర్థనా
తన్ముగ్ధా విఫలం విలంబనమసౌ రమ్యోఽభిసారేక్షణః. 33

తా॥ ఓ ముగ్ధురాలా! ఇప్పుడు నీవక్రత్వముతో సరిగా సూర్యుఁడ స్తమించెను. గోపాలకృష్ణుని కోరిక కనుకూలముగా చీకట్లు విస్తారముగా వ్యాపించెను. దీర్ఘమైన నాప్రార్థ,చక్ర వాకముల యొక్క దీనస్వరముతో సమానమై యొప్పుచున్నది. కావున కాలవిలంబనము వ్యర్థము. ఈక్షణముననే సంకేతస్థలమందు చేరుట రమణీయ మైనది.

శ్లో॥ ఆశ్లేషా దనుచుంబనా దనునఖో లేఖాదనుస్వాంతజ
ప్రోద్బోధా దనుసంభ్రమా దనుర తారంభా దనుప్రీతయోః
అన్యార్థంగతయో ర్భ్రమాన్మిళితయో స్సంభాషణై ర్జానతో
ర్దంపత్యోరిహ కోనుకోను తమసి క్రీడావిమిశ్రోరసః 3౪

శ్లో॥ అతిచకితం విన్యస్యంతీం దృశౌ తిమిరే పథి
ప్రతితరుముహు స్థిత్వామందం పదానివితన్వతీమ్ ।
కథంరహసిప్రాప్తా మంగై రనంగతరంగభి
స్సుముఖి సుభగః పశ్యన్ సత్వాముపైతు కృతార్థతాం. 3౫

సీ॥ అతుల గాఢాలింగ ♦ నావాప్తి వలనను,
నవలచుంబన వినో ♦ దాప్తివలన,

నాపిమ్మట నఖక్షత ♦ తారూఢివలనను,
నావెన్కఁ గోర్కుల ♦ హాసువలన
నాపిద పనుసంభ్ర ♦ మాయతివలన,
నంతర తారంభ ♦ మగుటవలన
నాతరువాత వా ♦ గభిరతి వలనను,
నవ్వాల బంధర ♦ మ్యతలవలన
గీ॥ దనరు రసరుచి నివ్వాడే ♦ మనఁగవచ్చుఁ
గాన నలకుచుఁ దమినంజ ♦ లూనినిలుచు
నిలచి మెల్లఁగ నడచి, మా ♦ నించియొదవు
నిన్నుఁగని ధన్యుఁడగు పతి ♦ నెలఁతరమ్మ॥

తా॥ 34, కౌగలింపుల చేతను, తరువాత అధరచుంబనము వలనను, పిదప నఖక్షతమువలనను, ఆవెనుక మనోద్రేకము చేతను, ఆవల సంభ్రమముచేతను అనంతరము సురతారంభమువల్ల నంతసవడుటయు, పిమ్మట భ్రమవలన, యితరవిషయ సంభాషణచేతను, తీరుగా కూడుకొన్నట్టి దంపతుల క్రీడలతోడఁ గూడిన శృగారరసము ఈ యంధకారమందు, ఏమేమని చెప్పవచ్చును (అనఁగా అత్యుత్తమము)

35 ఓ రాధా! సుందరుఁడైన, ఆశ్రీకృష్ణుఁడు, మిక్కిలి భయపడునట్లుగా చూపులను మార్గమందలి చీకటియందుంచుచున్నట్టియు, వృక్షము క్రిందను నిలచి, అందముగా నడుగులను పెట్టుచున్నట్టియు, మన్మథునిచేత చంచలములైన అవయవములచేత నతిప్రయత్నముగా నేకాంతమును బొందినట్టియు, నిన్ను వీక్షించువాఁడై కృతార్థత్వమును పొందును గాక.

శ్లో॥ అథ తాం గంతు మశక్తాం చిరమనురక్తాం లతాగృహే
దృష్ట్వా తచ్చరితం గోవిందే మనసిజమందే సఖీ ప్రాహ॥ 3౬



కం॥ అంతటఁ జనఁగన శక్తిన్
గాంతన రక్తిఁ లతాంతి ♦ ఘన గృహమున,
నయ్యింతిఁ గని తచ్చరి ♦ తము, ము
రాంతకునకుఁ దెలుపఁ జేర ♦ నరిగి వచించెన్.

తా॥ ఆ పిమ్మట పోవుట కసమర్థురాలైనట్టిన్ని, బహుకాలము అనురాగముతోఁ గూడినట్టిన్ని, అగు నా రాధను లతాగృహంబున, చూచి, ఆ రాధయొక్క చరిత్రను మన్మథునిచేత మందుఁడైన గోవిందునకు చెలికత్తె చెప్పెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే.

పంచమస్సర్గః

---

# షష్ఠస్సర్గః.

ద్వాదశాష్టపదీ ప్రారమ్భః

(శంకరాభరణ రాగేణ గీయతే.)

పల్లవి॥ నాథహరే జగన్నాథహరే - సీదతిరాధా వాసగృహే

౧. పశ్యతి దిశిదిశి రహసి భవంతం తదధర మధురమధూని పిబంతం ॥నాథ॥

౨. త్వదభిసరణ రభసేన వసంతీ పతతిపదాని కియంతిచలంతి ॥నాథ॥

౩. విహిత విశద బిస కిసలయ వలయా జీవతి పరమిహ తవ రతి కలయా ॥నాథ॥

౪. ముహురవలోకిత మండనలీలా మధురిపురహమితి భావనశీలా ॥నాథ॥

౫. త్వరితముపైతినకథమభిసారమ్ హరిరితివదతిసఖీమనువారమ్ ॥నాథ॥

౬. శ్లిష్యతి చుంబతిజలధరకల్పమ్ హరిరుపగత ఇతితిమిరమనల్పమ్ ॥నాథ

౭. భవతి విళంబిని విగళిత లజ్జా విలపతి రోదతి వాసకసజ్జా ॥నాథ॥

౮. శ్రీజయదేవక వేరిదముదితమ్ రసికజనంతను తామతిముదితమ్ ॥నాథ॥

తా॥ (1) జగన్నాథుఁడవైనట్టిన్ని, రాధానాథుఁడవైనట్టిన్ని, పశుపాలియుఁడవైనట్టిన్ని, అగు ఓ కృష్ణస్వామీ! లతాగృహంబున రాధ బాధపడుచున్నది. ఏకాంతమందు ఆరాధయొక్క యధరమధుర సుధారసంబును పానముఁ జేయునట్టి నిన్ను ప్రతిదిక్కులయందును వీక్షించుచున్నది. (౨) ఓహరీ! నిన్ను గూర్చి వచ్చుట యందలి కదువడిబడిన యడుగులతో రాధ తడబడి పడుచున్నది. (౩) ఓ కృష్ణా! రాధ స్వచ్ఛమైన తామర తూండ్లను కంకణములుగా గలిగినదై నీయొక్క రతిక్రీడలయం దాసక్తివలన (అనఁగా మనస్సంగమముచేత) బ్రతికియున్నది. (౪) ఓ శ్రీహరీ! రాధ మాటిమాటికిన్ని చూడదగిన యలంకార లీలావిలాసము గలదై శ్రీకృష్ణుఁడను నేనను భావించునట్టి స్వభావము గలదై యున్నది. (5) ఓ యదునందనా! ఆరాధ చెలికత్తెనగు నన్ను గూర్చి "శ్రీకృష్ణస్వామి సంకేతస్థానమును సత్వరముగా నింకనుయేల చేరక యున్నాడు" ఇట్లని మాటిమాటికిన్ని బలుకుచున్నది.. (6) ఓ మురళీమోహనా! ఆరాధ మేఘములకు సమానమైనట్టిన్ని, అధికముగా వ్యాపించినట్టిన్ని, అగు చీకటిని గూర్చి "శ్రీకృష్ణస్వామి వచ్చె" నని కౌగలించుకొనుచున్నది. ముద్దుపెట్టుకొనుచున్నది. (7) ఓ గోపీరమణా! ఆరాధ నివాసస్థానమునం దాయత్తగానున్నదై నీరాకయందాలస్యమగుటవలన లజ్జనువిడిచి ప్రలాపించుచున్నది. రోదనము చేయుచున్నది. (౮) శ్రీజయదేవ కవిచేత రచియింపఁబడిన యీగీతము రసిక జనముల సమందానందముఁ గలవారినిగాఁ జేయునుగాక.



శ్లో॥ విపుల పులక పాళిః స్ఫీత సీత్కారమంత
ర్జనితజడిత కాకూరాకులం వ్యాహరంతీ
తవకితవ విధత్తే మంద కందర్పచింతాం
రసజలధినిమగ్నాం ధ్యానలగ్నాం మృగాక్షీ. ౩౭

తా॥ ఓ మాయల మారి మాధవుఁడా! మృగాక్షి యయిన యీరాధ విపులములైన పులకల సమూహముగలదై, తరుచైన సీత్కారములు గలుగునట్లుఁగాను, లోపల పుట్టిన జాడ్యమువలన గలిగిన వికారధ్వనులను వ్యాకుల మౌనట్లుగా, పలుకుచున్నదై, శృంగార రసమనెడి సముద్రమునందు మునిఁగినదై నీయొక్క ధ్యానమునందు లగ్నమైనదై, ఎక్కువగా మన్మథవిచారము చేయుచున్నది.

శ్లో॥ అంగేష్వాభరణం కరోతి బహుశః పత్రేపి సంచారిణి
ప్రాప్తం త్వాం పరిశంకతే వితనుతే శయ్యాం చిరంధ్యాయతి
ఇత్యాకల్ప వికల్ప తల్పరచనా సంకల్పలీలాశత
వ్యాసక్తాపినా త్వయావరతను ర్యైనాంనిశాంనేష్యతి॥ ౩౮

చ॥ కనక సుభూషణంబులును ♦ గాయమునందిడు, నాకులాఁడ నిర్గ
గనముగ వచ్చినట్లు గని, ♦ కామిని తల్పమునున్ రచించి నిన్
గనుఁగొనలేక చింతిలి, వి ♦ కావికలొంది విరాళిఁజెంది యీ
మనసిజబాణ భిన్నమృదు ♦ మానసయై, నిశి నెట్లునుండునో!

తా॥ ఓ వంచకుఁడైన కృష్ణా! సుకుమార శరీరిణియైన యీ రాధ, తనయవయవము లందనేక విధములుగా ఆభరణముల నలంకరించుచున్నది ఆకు కదలినప్పటికిన్ని నిన్ను వచ్చిన వానివలె దలంచి యూహింపు చున్నది, పాన్పులు బరచుచున్నది. నిన్న దేతడువుగా ధ్యానింపుచున్నది. ఇవ్విధముగా భూషణాలంకార వికల్పముయొక్కయు, నీరాకయందలి సందేహము యొక్కయు, తల్పరచనా

శయనవికల్పము యొక్కయు, సంకల్ప మనోరథము యొక్క లీలా
విలాసము యొక్కయు, పనుల యందాసక్తి గలిగినదైనను, నిన్ను
విడచి యీ రాత్రిని గడపఁజాలదు.

శ్లో॥ అత్రాంతరేచ కులటాకుల వర్త్మపాత
సంజాతపాతక ఇవ స్ఫుటలాంఛనశ్రీః
బృందావనాంతర మదీప యదంశుజాలైః
దిక్సుందరీ వదనచందన బిందురిందుః॥ ౩౯

సీ॥ అని యిట్లు, చెలివల్క ♦ వినుచుండఁ, గృష్ణుండు,
నంతలో జగమెల్ల ♦ నంతసింపఁ
బ్రాచీ దిశాంగనా ♦ ప్రావిణ్య ముఖబింబ
విలసిత శ్రీగంధ ♦ తిలక మనఁగఁ
బాంసులా మార్గ వి ♦ ధ్వంసనం బొనరింపఁ
గా సంభవించిన ♦ దోసమనఁగ
స్ఫుట శాంబరీ కాంత ♦ ఘటనచే రాఁజిల్లు
కటిక చీఁకటికిని ♦ జెటులదీప

తే॥ మనఁగ విలసిల్లి మంత్రియై ♦ మనసిజునకు
ముదముఁ జేయుచు మదవతుల్ ♦ బెదరఁగాను
బదము లిడుచును రాధికా ♦ హృదయమునకు
గదయనొదవుచుఁ జందురుం ♦ డుదయ మయ్యె.

తా॥ ఈలోపల జారస్త్రీ సమూహము యొక్క మార్గమునందుఁ ప్రవర్తించుటచేత సంభవించిన పా చిహ్నమోయను నట్లు, వ్యక్తమైన లాంఛనకాంతి కలిగినట్టిన్ని, పూర్వదిక్కనెడు సుందరీ మణియొక్క ముఖమునందలి శ్రీగంధపుతిలకమో యనునట్లు, చందమామకిరణ సమూహములచేత బృందావన క్షేత్రముయొక్క మధ్యప్రదేశము నందు ప్రకాశించెను.



శ్లో॥ ప్రసరతి శశధరబింబే విహితవిలంబేచ మాధవే
విధురరచిత వివిధవిలాపా పరితాపం చకారోచ్చైః॥ ౪౦

తే॥ చంద్రబింబంబు నుదయించి ♦ చాలవెలుఁగ
మాధవుఁడును దారాక ♦ మానుకొనఁగఁ
జూచి చింతించి తలయూచి ♦ లేచివగచి
రాధికామణి యీరీతి ♦ బాధఁ జెందె.

తా॥ ఆరాధ చందమామ ఉదయింపుచుండుట చేతను, మాధవుని రాక యాలస్య మగుటచేతను, వివిధములైన పరిదేవనములు గలదై మిక్కిలి విచారముచేత పరితపించెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
షష్ఠస్సర్గః

---

# సప్తమస్సర్గః



త్రయోదశాష్టపదీప్రారమ్భః.

(మాళవ రాగేణ గీయతే.)

పల్లవి॥ యామికమిహ శరణం సఖీజన వచనవంచితా

౧. కథితసమయేఽపి హరిరహహ నయయౌ
యౌవనంమమవిఫల మిదమమలరూపమపి

౨. యదను గమనాయ నిశిగహనమపి శీలితమ్
తేనమమహృదయ మిదమసమశర కీలితమ్॥

3. మమమరణమేవ వరమతివితథ కేతనా
కిమిహవిషహామి విరహానల మచేతనా ॥యామి॥

౪. మామహహ విధురయతి మధురమధుయామినీ
కాపిహరిమనుభవతి కృతసుకృతకామినీ ॥యామి॥

౫. అహహ కలయామి వలయాదిమణి భూషణమ్
హరివిరహ దహన వహనేన బహుదూషణమ్ ॥యామి॥

౬. కుసుమ సుకుమార తనుమతను శరలీలయా
స్రగపిహృది హంతిమామతి విషమశీలయా ॥యామి॥

౭. అహమిహనివసామ్య నవగణితవేతసా
స్మరమధుసూదనో మామపినచేతసా ॥యామి॥

౮. హరిచరణ శరణ జయదేవకవి భారతీ
వసతుహృదియువతి రివకోమలకళావతీ ॥యామి॥

తా॥ (రాధ యిట్లను కొనుచున్నది.) చెలికత్తెల యొక్క వలుకుల వలన వంచింపఁబడిన "నేను" కటకటా! ఈ వనము నందెవ్వనిని రక్షకునిగా పొందుదును? (1) ఓ దైవమా! శ్రీకృష్ణుడు తాఁజెప్పి వేళకైనను యీవనమునకు రాఁడాయెను. కట్టా! నాయీవనము స్వచ్ఛమైన సౌందర్యమును గలిగినదైనను, వ్యర్థమయ్యెను. (2) ఏ కృష్ణుని వెంబడిపోవుట కొఱకు రాత్రియందడవిని సంచరింపఁబడెనో, ఆకృష్ణుని వలననే నామనస్సు మన్మథుని చేత కట్టబడెను. (3) మిక్కిలి వ్యర్థమైన సంకేతస్థలము గలిగినట్టిన్ని, వివేక హీనురాలైనట్టిన్ని, అయిననేను యీవిరహాగ్ని నెట్లీ వనంబునందు వహియింతును?(అనఁగా వహింపజాలను)ఆకారణము వలన నాకుమరణమే శ్రేష్ఠము (4) పుణ్యములు సేసిన యెవతయో, యొక కామిని శ్రీకృష్ణుని అనుభవించుచున్నది. కటకటా! నన్ను మనోహరమైన వసంతఋతువు నందలి యీ రాత్రి దుఃఖింపఁ జేయుచున్నది. (5) కట్టా! శ్రీకృష్ణుని యొక్క విరహాగ్ని నిభరించుట వలన, నాయీ కంకణాది రత్నఖచితా



భరణములు మిక్కిలి నింద్యములైన వానినిగా తలంచుచున్నాను. (6) అతివిషమ స్వభావము గల మన్మథుని బాణముల యొక్క విలాసము, నాహృదయమందలి పుష్పమాలికనున్ను, కుసుమము కంటె మృదువైన శరీరముగల నన్నును, హింసింపుచున్నది. (7) అగణితములైన ప్రబ్బలి చెట్లుగలదాననై నేనీ పొదరింటియందు నివసించు చున్నాను. కటకటా! ఆమధుసూదనుఁడు మనస్సు చేతనైనను నన్ను స్మరింప కున్నాఁడు. (8) శ్రీకృష్ణభగవానుని పాదములె శరణములుగాఁ గలిగిన శ్రీజయదేవ కవీశ్వరుని యొక్క వాక్కు మృదులములైన కళలుగల కాంతామణి వలె హృదయము నందుండును గాక.

శ్లో॥ తత్కాంతామపి కామసీ మభిసృతః కింవాకళాకేళిభిః
బద్ధోబంధుభి రంధకారిణి వనాభ్యర్ణే కిముభ్రామ్యతీ
కాంతాక్లాంతమనా మనాగపి పథిప్రస్థాతు మేవాక్షమః
సంకేతీకృత మంజువంజులతా కుఞ్జేపి యన్నాగతః॥ ౪౧

శ్లో॥ అథాగతాంమాధవమంతరేణ సఖీమియం వీక్ష్యవిషాదమూకాం
విశంకమానా రమితంకయాపి జనార్దనం దృష్టవ దేతదాహ॥ ౪౨

సీ॥ శ్రీకృష్ణుడీవేళ ♦ శృంగారవాసిర
సంకేతశాలకు ♦ బోంకముగను
నేలకో రాఁడాయె ♦ బాలికా మణిఁగూడి
వలరాజు కేళిలో ♦ మెలఁగి నాఁడో
చెలికాంద్రతోఁ గూడి ♦ వెలినాడు చున్నాఁడో
వేణుగానంబుచే ♦ వెలసినాఁడో
తిమిరంబుచేఁ జాల ♦ భ్రమఁజెంది యున్నాఁడో
సుమబాణ బాధచే ♦ సొలసినాఁడో

తే॥ యనుచు నుండఁగ హరిచేత • నాజ్ఞవడసి
యరుగుదెంచిన సఖిఁజూచి, • హరిని, గాన
కహహ శంకించె, వేఱొక • యతివతోడఁ
గలసినట్లు లతాఁజూచి • పలికె నటుల.

తా॥ 41 "ఏకారణము వలన, సుందరుండైన శ్రీకృష్ణస్వామి సంకేతముగాఁ జేయఁబడిన రమ్యములయిన ప్రబ్బలి చెట్లతీగెల యొక్క పొదరింటి రాకుండెనో? అకారణ మిట్లుండనా?" "ఒకానొక కామినిని అనుసరించి పోయె నేమో? లేక; కళలయొక్క క్రీడలుగల స్నేహితుల వలన నడ్డగింపఁబడె నేమో? లేక; చీఁకటిగల యీ వనసమీపమునందే తిరుగు చున్నాడేమో? అట్లుకానిచో కలఁతనొందిన మనస్సు గలవాఁడయి యీ పొదరింటిగుర్తు మరచి దారితప్పె నేమో?" అని రాధ తలపోయుచుండెను.

42 అటు తరువాత, ఈ రాధ, కృష్ణుని తోడొ్కని రాక యొంటరిగా వచ్చినట్టిదియు, విషాదమున మూగదానివలె నున్నట్టిదియు, అగు చెలికత్తెను వీక్షించి, శ్రీకృష్ణస్వామి వేరొక కామినితోఁ గ్రీడించుచున్నవానిసిగా నూహించునదై ప్రత్యక్షముగాఁ జూచిన దానివలెనే యీక్రింది వాక్యములను పలికెను.

---

# చతుర్దశాష్టపదీప్రారంభః.



(వసంత రాగేణ గీయతే.)

పల్లవి॥ కాపి మధురిపుణాసహ విరహతి యువతిరధికగుణా.

౧. స్మర సమరోచిత విరచిత వేషా
గళిత కుసుమభర దరవిలులిత కేశా ॥కాపి॥



౨. హరిపరిరంభణ వలితవికారా-కుచకలశోపరి తరళితహారా ॥కాపి॥
౩. విచలదలక లలితాననచంద్రా-తదధర పానరభసకృతతంద్రా ॥కాపి॥
౪. చంచల కుండల లలిత కపోలా-ముఖరిత రశన జఘన గతిలోలా॥
౫. దయిత విలోకిత లజ్జిత హసితా-బహువిధ కూజిత రతిరస రసితా
౬. విపులపులక పృథు వేపథుభంగా-శ్వసిత నిమీలిత వికస దనంగా
౭. శ్రమజల కణభర సుభగ శరీరా-పరిపతితోరసి రతిరణధీరా ॥కాపి॥
౮. శ్రీజయదేవభణితహరిచరితం-కలికలుషంజనయతుపరిశమితం॥కాపి॥

తా॥ ఒకానొక కాంత అతిశయములైన గుణములుగలదై మురహరితోఁగూడి విహరింపు చున్నది. (1) మన్మథ యుద్ధమునకుఁ దగిన విధముగా వేయబడిన వేషముగల్గినట్టిన్ని, జారుచున్న పువ్వులు గలిగి యించుకంత నలుపఁబడిన వెంట్రుకలు కలిగినట్టిన్ని, అగు నొకానొక స్త్రీ క్రీడించుచున్నది. (2) శ్రీకృష్ణమూర్తి యొక్క యాలింగనముచేత చలించిన మన్మథ వికారము గల్గినట్టిన్ని, కలశములవంటి కుచముల మీఁద కదలియాడుచున్న ముత్యాలహారములు గల్గినట్టిన్ని, అగు నొకానొక యువతి మధురిపునితో విహరింపు చున్నది. (3) చలించుచున్న ముంగురులతోడి ముఖచంద్రుని కలిగినట్టిన్ని, ఆ శ్రీకృష్ణమూర్తి యొక్క యధరపానము వలనిరభసముచేత కునుకుపాటు గల్గినట్టిన్ని, అగు నొకానొక గరిత గిరిధరునితో విహరింపు చున్నది. (4) కదలుచున్న కుండలములచేత నొప్పుచున్న కపోలములు గలిగినట్టిన్ని, గమనము వలన మ్రోఁగుచున్న మొలనూలు గలిగి చలింపుచున్న కటిపురోభాగము గలిగినట్టిన్ని, అగు నొకానొక నారీమణి సారసనయనునితో క్రీడించుచున్నది. (5) దయితుఁడయిన శ్రీకృష్ణునిచేత చూడబడి సిగ్గునొందినదై నవ్వుచున్నట్టిన్ని, బహువిధములగు ధ్వనులు గలిగిన సురతము నందలి యనురాగము వలన ధ్వని

చేయుచున్నట్టిన్ని, అగు నొకానొక మానినీమణి మాధవునితో మరుకేళి నాడుచున్నది. (6) విపులములైన పులకలు గలినట్టిన్ని, అధికముగా నణకుటలనెడి తరంగములు గలిగినట్టిన్ని, నిట్టూర్పుల చేత నిమీలితమైనట్టిన్ని, ప్రకాశించునట్టి మన్మథునిఁ గలిగినట్టిన్ని, అగు నొకానొక కమలాక్షి కంజాక్షునితో రతికేళి సలుపుచున్నది. (7) చెమటబిందువుల యొక్క యాధిక్యమువలన నొప్పుచున్న శరీరము గలిగినట్టిన్ని, వక్షస్థలమందు పడుచున్న సురతమెనెడి యుద్ధమునందు శూరురాలైనట్టిన్ని, అగు నొకానొక సారసాక్షి పుండరీకాక్షునితో మారునికేళి నోలలాడుచున్నది. (8) శ్రీజయదేవ కవీంద్రునిచేఁ జెప్పఁబడిన శ్రీకృష్ణచరితము కలియుగ సంబంధమగు పాపమును శాంతిఁ బొందించునుగాక.

శ్లో॥ విరహపాండు మురారి ముఖాంబుజ
ద్యుతిరయంతి రయన్నపి వేదనాం
విధురతీవ తనోతి మనోభవ
స్సుహృదయే హృదయే మదనవ్యథాం॥ ౪౩

తే॥ విరహ పాండురమైనట్టి ♦ హరిముఖాబ్జ
దీప్తిగల్గిన చంద్రుఁడు ♦ దీర్ఘతావ
మడఁచు, వాఁడైన, కంతుని ♦ కాప్తుఁడగుట
నాదు మదిలోని దావంబు ♦ బ్రోదిఁజేయు.

తా॥ ఓ చెలీ! మన్మథునకు స్నేహితుఁడైనట్టిన్ని, విరహముచేత తెల్లనైన శ్రీకృష్ణుని యొక్క ముఖకమలము యొక్క కాంతివంటి గాంతిని గలిగినట్టిన్ని, అగు నీ చంద్రుఁడు వ్యథను అచ్ఛాదించుచున్నాఁడు. హృదయమునందు మదనపీడను విస్తరింపఁజేయుచున్నాడు.

---



# పంచదశాష్టపదీప్రారంభః.

(ఘూర్జరీ రాగేణ గీయతే.)

పల్లవి॥ రమతే యమునా పులినవనే విజయీ మురారి రధునా॥

౧. సముదితమదనే రమణీవదనే చుంబన లలితాధరే
మృగమదతిలకం లిఖతిసపులకం మృగమివ రజనీ కరే ॥రమతే॥

౨. ఘనచయరుచిరే రచయతిచికురే తరళిత తరుణాననే
కురువక కుసుమం చపలాసుసుమం రతిపతి మృగకాననే ॥రమతే॥

౩. ఘటయతి సుఘనే కుచయుగ గగనే మృగమద రుచిదూషితే
మణిసరమమలం తారకపటలం నఖపద శశి భూషితే ॥రమతే॥

౪. జితబిసశకలే మృదుభుజ యుగళే। కరతల నళినీదళే
మరకతవలయం మధుకరనిచయం వితరతి హిమశీతలే ॥రమతే॥

౫. రతిగృహజఘనే విపులాపఘనే మనసిజ కనకాసనే
మణిమయరశనాం తోరణహాసనాం। వికిరతి కృతవాసనే ॥రమ॥

౬. చరణకిసలయే। కమలానిలయే నఖమణి గణభూషితే
బహిరపవరణం యావాభరణం।జనయతి హృదిమోజితే ॥రమతే॥

౭. ధ్యాయతిసదృశం కామపిసుదృశం ఖలుహలధర సోదరే
కింఫలమవశం చిరమిహావిరసం। వద సఖి విటపోదరే ॥రమతే॥

౮. ఇహరసభణనే కృతహరిగుణనే మధురిపు పదసేవనే
కలియుగ చరితం నవసతు దురితం। కవినృప జయదేవకే ॥రమతే॥

తా॥ ఓ సఖియా! ఇప్పుడు జయశీలుఁడైన గోపాలుఁడు యమునానదీ యిసుకతిన్నెలుగల వనమునందు క్రీడింపుచున్నాడు. (1) పుట్టింపబడిన మన్మథలీల గలిగి, ముద్దుపెట్టుటచేత మనోజ్ఞతను పొందిన పెదవిగలిగిన పురుషోత్తముఁడు, ముద్దరాలి ముఖసీమను ముంగురు

లోప్పుచుండఁగా చంద్రుని యందలి లేడివలె కస్తూరితిలకము నిదిద్దుచున్నాఁడు. (2) మురహరి; మేఘసమూహమువలె మిగుల రంజిలుచున్నదియు, కదలింపఁబడిన యౌవన యుక్తమయినదియు, అగు ముఖము గల్గినట్టియు, మన్మథుఁ డనెడి మృగమునకు అడవి యైనట్టిదియు, అగు కేశపాశమునందు మెఱుపువంటి యుత్తమకాంతిగల గోరంట పువ్వులను శృంగారించుచున్నాఁడు. (3) కమలనాభుఁడు, కస్తూరి కాంతిచేతల్వ్యాప్తమైనట్టిన్ని, నఖక్షతములనెడి చంద్రవంకలచేత నలంకరింపఁబడిన స్తనద్వయమనెడి ఆకాశమునందు, దట్టమైనట్టిన్ని, నిర్మలమైనట్టిన్ని, అగు ముత్యాలహారము లనెడి నక్షత్రసమూహమును కూర్చుచున్నాఁడు. (4) దైత్యారి, జయింపఁబడిన తామర తూండ్ల తునుకలు గలిగిట్టిన్ని, కరతలములను తామరరేకులు గలిగినట్టిన్ని, మంచువలె చల్లనైనట్టి కోమలమైన బాహుద్వయమునందు, తుమ్మెదల సమూహమువంటి మరకత మణుల కడియముల నలంకరింపు చున్నాడు. (5) రమాకాంతుఁడు, మిక్కిలి విశాలమైన యూరాకృతిని గలిగినట్టిన్ని, చేయబడిన వాసనఁ గలిగినట్టిన్ని, మన్మథునియొక్క స్వర్ణసింహాసనమువలె నున్నట్టిన్ని, శృంగారమున కునికిపట్టయి నట్టిన్ని, అగు మొలయందు తోరణమును పరిహసించునట్టి రతనములనుదాపిన మొలనూలిని, ఆమెకు గట్టి అలంకరించు చున్నాఁడు. (6) మురళీమోహనుఁడు; ఒక మోహనాంగికి, లక్ష్మీదేవికి నిలయమైనట్టిన్ని, గోళ్ళనెడు రత్న సమూహముచేత నలంకరింపఁబడినట్టిన్ని, వక్షస్థలమునందు కూర్చబడిన పాదములనెడు చివురుటాకులందు, బాహ్యప్రదేశమును కప్పునట్టి లత్తుకయనెడి భూషణమును, అలంకరింపుచున్నాఁడు. (7) యదునందనుఁడు, ఒకానొక కాంతను తనకనమాన మా



నట్టుగా తలపోయుచుండఁగా, యీ పొదరింటియందు, అస్వాధీనమగునట్టుగా నేను తడవుండుట నిస్సారమగునదియు, నిష్ఫలమైనదియును, అగును గదా! ఓ చెలియా! ఏమందువు. (8) శృంగార యుక్త ప్రసిద్ధమగు పలుకులు గలిగిన యీ గీతమునందు శ్రీకృష్ణ స్వామిని నుతించుట వలను, గలిగినదియు, మధురిపుని పాదసేవకుఁడైన కవిశ్రేష్ఠుఁడగు జయదేవుని యందు కలియుగమునందాచరింపఁబడిన పాపముల తొలఁగి పోవును గాక!

శ్లో॥ నాయాతస్సఖి నిర్దయో యదిశఠ స్త్వందూతికిం దూయసే
స్వచ్ఛందం బహువల్లభ స్సమరతేకిం తత్ర తే దూషణం
పశ్యాద్య ప్రియసంగమా యదయితస్యాకృష్యమాణం గుణై:
ఉత్కంఠార్తిభరాదివస్ఫుటమిదం చేతస్స్వయం యాస్యతి॥ ౪౪

సీ॥ ఓ సఖీమణి, కృష్ణు ♦ డీ సమయంబున
నిర్దయుఁడై రాక ♦ నిలచె ననుచు
గోపికా మణులతోఁ ♦ గూడియుండు నటంచు
దూషణంబును జేయ ♦ దోసమనుచు
సంతోష ముప్పొంగ ♦ చాట్పునఁ బ్రియుఁగూడు
టకు నాదుచిత్తంబు ♦ సుకరముగను
హరి గుణంబులచేత ♦ నాకర్షితంబయి
తాఁబోయినని పల్కి ♦ తరుణి యపుడు.

(ఈ సీసమునందలి తేటగీత 46 శ్లోకానువాదము కావున నచ్చటకు చేర్చితినని మనవి చేయుచును చుంటిని.)

తా॥ ఓ చెలీ! దూతికా! ధూర్తుఁడును దయాశూన్యుఁడును, అయిన శ్రీకృష్ణమూర్తి రాకపోయి నందుకు నీవేల దుఃఖించెదవు? ఆ కృష్ణుఁడు స్వతంత్రుఁడై బహు స్త్రీలకు ప్రియుఁడై క్రీడించుచున్నాఁడు, అందువలన నవమానము నీకేల? ఇప్పుడు కోరిక పీడ సహింపవలను గాక, నామనస్సు శ్రీకృష్ణమూర్తియొక్క సౌందర్య సద్గుణములచేత నాకర్షింపఁబడినదై ప్రియునియొక్క కూటమికొఱకు తనంతట తానే పోవుచున్నది. చూడుమా!

# షోడశాష్టపదీప్రారంభః.

(కరాళి రాగేణ గీయతే.)

పల్లవి. యారమితా వనమాలినా - సఖి - యారమితా వనమాలినా
౧. అనిలతరల కువలయ నయనేన-పతితనసా కిసలయ శయనేన॥
౨. వికసిత సరసిజ లలితముఖేన-స్ఫుటతి నసా మనసిజ విశిఖేన॥యా॥
౩. అమృతమధుర మృదువరవచనేన-జ్వలతినసా మలయజరచనేన
౪. స్థలజలరుహ రుచికరచరణేన- లుఠతినసా హిమకర కిరణేన ॥యా॥
౫. సజలజలద సముదయ రుచిరేణ-దళతినసా హృదివిరహ భరేణ
౬. కనకనిచయ రుచిశుచి వసనేన-శ్వసతినసా పరిజన హసనేన॥యా॥
౭. సకలభువన జనవరతరుణేన - వహతినసా రుజమతి కరుణేన ॥యా॥
౮. శ్రీజయదేవఫణిత మననేన-ప్రవిశతు హరిరపి హృదయమనేన॥యా॥

తా॥ (1) ఓ చెలీ! వాయువు వలన, కదలింపఁబడిన నల్లకలువల వంటి నేత్రములుగలిగిన వనమాలిచేత నేవనిత క్రీడింపఁబడెనో, ఆ వనిత చిరుగుటాకుల పాన్పునఁబడదు. (2) ఓ చెలీ! వికసించిన కమలము వలె నొప్పుచున్న ముఖము గలిగిన ముకుందునితో నేకాంత లలామ క్రీడించఁ బడునో, యది మదనబాణములచేత వేధింపఁ బడదు, (3) ఓ చెలీ! అమృతమువలె మధురములయి మెత్తనివి యయి శ్రేష్ఠములయిన పలుకులుగల జనార్దనునితో నే జవ్వని క్రీడించఁ బడునో; అది గంధపు పూతలకు పరితాపము నొందదు. (4) మెట్టతామరల కాంతివంటి కాంతిగల గాళ్లు చేతులు గలిగిన కేశవునితో; నే యువతీమణి రమింపఁబడునో; అది చంద్రకిరణము లకుఁ బొరలాడదు. (5) ఓ చెలీ! నీలమేఘ సమూహ కాంతివంటి కాంతిగల, ఆ నీలమేఘ శ్యామునితో; ఏ యలివేణి క్రీడింపఁ



బడునో; అది విరహోద్రేకమున హృదయము ప్రక్కలింపఁబడదు. (6) ఓ చెలీ! బంగారు కాంతిని బోలిన గాంతిగల పరిశుద్ధమైన వస్త్రముఁగలిగిన, ఆ పీతాంబర ధారితో, ఏ గజయాన క్రీడింపఁ బడునో; అది పరిజనముల పరిహాసములకై నిట్టూర్పులు విడువదు. (7) సకలభువన జనశ్రేష్ఠుఁడైన యౌవనవంతుఁడగు నాపురుషోత్త మునిచే, ఏ తరుణీలలామ క్రీడింప బడునో; అది, అత్యంతకరుణా రసముచేత పరితాపమునుఁ బొందదు. (8) శ్రీజయదేవ కవీంద్రుని చేతఁ జెప్పబడిన యీ గీతమును మననము చేయుటవలన శ్రీకృష్ణ భగవాఁడు హృదయమునందుఁ ప్రవేశించును గాక.

శ్లో॥ మనోభవానందన చందనానిలః
ప్రసీదరే దక్షిణ ముంచవామతాం
క్షణంజగత్ప్రాణ నిధాయమాధవం
పురోమమప్రాణ హరోభవిష్యతి. ౪౫

తే॥ గే॥ మదన సహకారివైయొప్పు ♦ మందమారు
తమును గన్గొని దక్షిణ ♦ తరుణవామ
భావ మిప్పుడు విడనాడి ♦ పద్మనయను
నిటకుఁ జేర్చియు ననుబ్రోవు ♦ మిపుడుసదయ.

తా॥ మన్మథున కానందమును గలుగఁజేయ సమర్థుఁడవైన యో మలయ మారుతమా! నీచెడు నడ వడిని వీడుము. నాముందర కృష్ణస్వామిని క్షణకాలము నిలిపి పుణ్యమును బొందుము. లేకున్నచో; లోకములకు ప్రాణస్వరూపమైనట్టి నీవు నాయెడ ప్రాణాపహారి వగుదువు.

శ్లో॥ బాధాంవిదేహి మలయానిల, పంచబాణ
ప్రాణాన్గృహాణ, నపునర్గృహమాశ్రయిష్యే
కింతేకృతాంతభగినీ, క్షమయాతరంగైః
అంగానిసించమమశామ్యతుదేహదాహః. ౪౬

తా॥ ఓమలయ మారుతమా! నీవునన్ను బాధింపుము; ఓపంచ బాణా! నీవు నాప్రాణములను హరింపుము, యమధర్మరాజునకు సోదరివైన యో యమునానదీ! నీసైరణ వలన ప్రయోజనమేమి? నీ యలలచేత నాయవయవములను తడుపుమా; నాశరీరతాపము శమించును. నేను తిరిగి యింటికిఁ జేరను.

శ్లో॥ అణకథమపి యామినీంవినీయ
స్మరశరజర్ఝరి తాపిసాప్రభాతే
అనునయసద్వినయం వదంతమగ్రే
ప్రణతమపి ప్రియమాహ సాభ్యసూయం. ౪౮

సీ॥ ఆరాధి కామణి ♦ యారాత్రి నీరీతిఁ
గఠినంబుగనుబ్రొద్దు ♦ గడపి యిపుడు
కందర్ప శరభిన్న ♦ గాత్రియై నను బ్రభా
తంబు నందును నంద ♦ తనయుఁడంత
వినయంబుగాఁ బల్కి ♦ తనపదాబ్జంబుల
కనువొంద మ్రొక్కుచు ♦ గావుమనుచు
బలికి దీనత నొందు ♦ కలికి కృష్ణునిఁజూచి
పలికె నసూయ ♦ పరిఢవిల్ల

(ఈ సీసపద్యము యొక్క గీతము 48 వ శ్లోకమునకును వదింపఁ బడుటచే 48 వ శ్లోకము దగ్గర చేర్చడమైనది.)

తా॥ అటు తరువాత, ఆరాధ మన్మథబాణములచే నొప్పింపఁబడినదై నను, అతికష్టముతో రాత్రిని గడపి, ప్రాతఃకాలమునందు తన ముందర యను నయవాక్యములచేత వినయోక్తులు పలుకునట్టిన్ని, నమ్రుఁడైనట్టిన్ని, ప్రేమాస్పదుఁడైనట్టిన్ని, అగు శ్రీకృష్ణస్వామినిఁ గూర్చి మిక్కిలి అసూయతో నిట్లు పలికెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
సప్తమస్సర్గః.



# గీతగోవిందే అష్టమస్సర్గః.

సప్తదశాష్టపదీ ప్రారంభః.

(భైరవి రాగేణ గీయతే.)

పల్లవి. యాహిమాధవ యాహి కేశవ - మావదకైతవ వాదం॥
తామనుసర సరసీరుహలోచన - యా తవహరతివిషాదం।

౧. రజని జనితగురు జాగర రాగ - కషాయిత మలస నిమేషం
వహతి నయనమను రాగమివస్ఫుట-ముదితరసాభినివేశం ॥యాహి॥

౨. కజ్జలమలిన విలోచనచుంబన - విరచిత నీలిమరూపం
దశనవసన మరుణంతవకృష్ణ - తనోతి తనోరనురూపం ॥యాహి॥

౩. వపురనుసరతి తవస్మరసంగర - ఖర నఖరక్షత రేఖం
మరకతశకల కలితకలధౌత - లిపేరివ రతిజయలేఖం ॥యాహి॥

౪. చరణకమల దళలక్తక సిక్తమి - దంతవహృదయముదారం
దర్శయతీవ బహిర్మదనద్రుమ - నవకిసలయ పరివారం ॥యాహి॥

౫. దశన పదంభవ దధరగతంమమ-రచయతి చేతసి ఖేదం
కథయతి కథమధునాపి మయాసహ-తవవపురేతదభేదం ॥యా॥

౬. బహిరివమలిన తరంతవకృష్ణ-మనోపి భవిష్యతి నూనం
కథమనువంచయసే జనమనుగత-మసమ శరజ్వలమానం ॥యా॥

౭. భ్రమతి భవానబలా కబళాయ - వనేషు కిమత్ర విచిత్రం
ప్రథయతి పూతన కైవ వధూవధ-నిర్దయ బాల చరిత్రం

౮. శ్రీజయదేవ భణిత రతివంచిత-ఖండిత యువతి విలాపం
శృణుత సుధా మధురవిబుధా - వదతాపినుఖంసుదురాపం ॥యా॥

తా॥ ఓ మాధవా! నీవు పొమ్ము. కపటపుమాటలను మాట్లాడకుము. ఓ కేశవా! పోపొమ్ము ఓ సరసీరుహ లోచనా! నీ నాయకురాలు నీ విషాదమును వారింపుచున్నదో; ఆముగ్ధననుసరించి పో పొమ్మా! (1) రాత్రియందు గలిగిన యత్యధిక నిద్రాభావముచేత సంభవించిన రక్తిమచేత రక్తాధిక శ్వేతము వర్ణముగాఁ జేయబడినట్టిన్ని, మందమైన ఱెప్పపాట్లు గలిగినట్టిన్ని, జనించిన యనురాగము యొక్క ఆగ్రహము గలిగినట్టిన్ని, అగు నీ నయనములు అనురాగమును స్వచ్ఛమగునట్టుగా వహింపుచున్నవో యనునట్లు ఉన్నవి. [2] ఓ కృష్ణా! కాటుకకండ్లను ముద్దుబెట్టుకొనుటచే నంటిన నలుపుగల నీ యొఱ్ఱని వాతెర నీ శరీరమునకు సాదృశ్యముగా నున్నది. (3) ఓ మాధవా! నీ శరీరము స్మరసంగరమునందు తీక్ష్ణమైన గోటిపోటుల వలన గలిగిన గాయముల రేఖలుగలదై మరకత మణులయొక్క తునియల యందొప్పుచున్న బంగారు లిపివలననైన రతీదేవియొక్క జయలేఖను బోలియున్నది. (4) ఓ మధుసూదనా! వెడల్పుగల నీ వక్షస్థలము, పదకమలముల యొక్క రేకలందుగల లత్తుకచేతఁ దడుపఁబడినదై, మన్మథుఁడనెడి తీయమామిడిచెట్టు యొక్క నూత్నములైన చిగుళ్ల సమూహమును వెలపటను చూపుచున్నదో యనునట్లు ఉన్నది. (5) ఓ మురళీమోహనా! నీ యధరమును పొందియున్న దంతక్షతము నా మనస్సునందు దుఃఖమును గలిగింపుచున్నది. ఇప్పుడైనను నీ యీ శరీరమును నాకు భేదము లేనిదానిగా నెట్లు చెప్పగలవు? (6) ఓ గిరిధరా! నీ మనస్సు నీ బాహ్యశరీరము వలెనే మిక్కిలి మలినమైనది కాఁగలదు. ముమ్మాటికి నిశ్చయము. అట్లుగాకపోయినచో; నీశరణముఁ బొందినట్టియు, మన్మథునిచే తపింపబడుచున్నట్టియు, జనము నెట్లు మోసగించుచుంటివి? [7] ఓ కరివరదా! నీవు బృందావనమున



లందబలలను కబళించుటకొఱకు తిరుగుచున్నావు, ఇందుల కాశ్చర్యమేమి? స్త్రీలయొక్క వధలందు నిర్దయలేనట్టి నీ చిన్ననాటి చారిత్రమునుగూర్చి పూతనయను రాక్షసాంగనయే ప్రసిద్ధపఱచుచున్నది. [8] ఓ విద్వాంసులారా! అమృతము వలె చెవులకింపైన శ్రీజయదేవకవిచేఁ జెప్పఁబడిన, క్రీడయందు మోసపుచ్చఁబడిన ఖండితనాయిక యగు రాధయొక్క దుఃఖరూపకమైన గీతమును వినుఁడు. ఇంతేకాదు, దీనిని గానముచేసి దుర్లభమగు సుఖములు పొందుడు.

శ్లో॥ తవేదం పశ్యంత్యాః ప్రసరదనురాగం బహిరివ
ప్రియాపాదాలక్తచ్ఛురిత మరుణచ్ఛాయ హృదయం
మమాద్యప్రఖ్యాత ప్రణయ భరభంగేన కితవ
త్వదాలోకశ్శోకా దపి కిమపి లజ్జాం జనయతి. ౮౨

తే. గీ. సరస యావక రసయుత ♦ చరణ లలిత
హృదయ మిప్పుడు సూడఁగ ♦ సదిర కితవ
ప్రేమఁ జూపుచు నున్నది, ♦ తామసమును
జాల సిగ్గును జేసెఁబో ♦ సరసి జాక్ష.

తా॥ ఓ మాయలమారి మాధవుఁడా! నీచూపు, ప్రియురాలి చరణములందలి లత్తుకలచే వ్యాప్తమై వెలపటను ప్రసరించుచున్న అనురాగమువలె నున్నది. నీయొక్క యొఱ్ఱనగు కాంతిని గల వక్షస్థలమును చూపుచున్న, నాకు ప్రసిద్ధమైన ప్రేమాధిక్యము యొక్క భంగమువలన, నావిచారము వలెనే యొకానొక విధముగా సిగ్గు పుట్టుచున్నది.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
అష్టమస్సర్గః.

---

# గీతగోవిందే నవమస్సర్గః.



శ్లో. తా మథ మన్మథ ఖిన్నామ్
రతిరస భిన్నాం విషాద సంపన్నామ్
అనుచింతిత హరిచరితాం
కలహాంతరి తాముువాచరహస్సఖీం. ౪౯

తే. గీ. మకర కేతను బాధచే ♦ మనసు గంధఁ
జాల దుఃఖించి సతతంబు ♦ సారసాక్షుఁ
గూడి కలహించి హసియించి ♦ కుంజమునను
జేరియుండిన రాధతోఁ ♦ జెలియ పలికె.

తా॥ ఆ తరువాత, మదనునిచేత దుఃఖితురాలైనట్టిన్ని, క్రీడాసుఖము కొఱకు వేఱుచేయఁ బడినట్టిన్ని, విషాదముతోఁ గూడు కొన్నట్టిన్ని, తలంచుచున్న శ్రీకృష్ణచేష్టలు గలిగినట్టిన్ని, కలహము చేత మరియొక ప్రదేశమును బొందినట్టిన్ని, అగు, రాధను గూర్చి యేకాంతమందు చెలికత్తె యిట్లు పలికెను.

---

## అష్టాదశాష్టపదీ ప్రారంభః.



(ఘూర్జరీ రాగేణ గీయతే.)

పల్లవి. మాధవే రమాధవే-మాకురు మానిని మానమయే.

౧. హరి రభిసరతి - వహతి మధుపవనే
కిమపర మధిక - సుఖం సఖిభవనే మాధవే

౨. తాళ ఫలాదపి - గురుమతి సరసం
కిము విఫలీకురు షే కుచ కలశమ్ మాధవే



3. కఠిన కథితమిద - మనుపమ మచిరం
మాపరిహార హరి - మతిశయ రుచిరమ్ మాధవే

౪. కిమితి విషీదసి - రోదసివికలా
విహసతియువతిస - భాతవ సకలా మాధవే

౫. మృదుల నలినదళ - శీలిత శయనే
హరిరవలోకయ - సఫలయ నయనే మాధవే

౬. జనయసిమనసి - కిమితి గురుఖేదం
శ్రుణుమమసువచన - మనిహితభేదం మాధవే

౭. హరిరుపయాతు - వదతు బహుమధురమ్
కిమితికరోషి - హృదయ మతివిధురమ్ మాధవే

౮. శ్రీజయదేవ భణిత - మతిలలితమ్
సుఖయతు రసిక - జనంహరి చరితమ్. మాధవే॥

తా॥ ఓ రాధా! అభిమానియు రమాధవుఁడునగునైన శ్రీనివాసుని యందు కోపముంచకుము [1] శ్రీహరి; వసంతఋతువు యొక్క వాయువు వీచుచుండఁగా వచ్చుచున్నాఁడు. ఓరాధా! ఇంటి యందు మరియొక యధికసుఖము దీనికంటె యేమున్నది. [2]ఓ రాధా! తాటిపండ్లకంటెగొప్పలైనట్టిన్ని, మిక్కిలి రసయుక్తములైనట్టిన్ని, అగు కుంభములవంటి నీ స్తనముల నేల వ్యర్థము చేయుచున్నావు? [3] ఓ రాధా! మాటిమాటికిన్ని కఠినముగాఁ జెప్పఁబడిన నా యీ వాక్యములనుత్రోసి రాజనకుమా! మిగుల సుందరుఁడైన శ్రీకృష్ణుని త్వరలో ననుసరింపుమా! [4] ఓ రాధా! ఎందులకని దీనవదనవై దుఃఖించుచున్నావు? కళాహీనురాలవై యేల యేడ్చుచున్నావు? నీ చెలికత్తె సమూహమంతయును హేళనమును జేయుచున్నారు గదే! [5] ఓ రాధా! కోమలములైన

పద్మదళములచే పఱచిన పాన్పునందు శ్రీకృష్ణభగవానుని గనుంగొనుమా! నీ నేత్రములను సార్థకపఱచుకొనం గదవే! [6] ఓ రాధా! ఏమని నీమనస్సు నందధిక దుఃఖమును పుట్టించుచున్నావు. ఖేదము లేశమైనను చేయని నా సువచనములను వినుము. [7] ఓ రాధా! శ్రీకృష్ణుండు వచ్చును గాక; మిక్కిలి ప్రియమగునట్లుగా నీతో సంభాషించును గాక; ఎందులకని నీ మనస్సును మిక్కిలి దుఃఖపడిన దానినిగాం జేయున్నావు? [8] శ్రీజయదేవకవిచేం జెప్పంబడి నదియును, మిగుల మృదువై నదియును; అగు శ్రీకృష్ణపావన చరిత్రము శృంగారాది రసము నెఱింగిన రసికులను సుఖింపంజేయును గాక!

శ్లో. స్నిగ్ధేయత్పరుషాసి యత్ప్రణమతి స్తబ్ధాసి యద్రాగిణి
ద్వేషస్థాసి యదున్ముఖే విముఖతాం యాతాసి తస్మిన్ ప్రియే
తద్యుక్తం విపరీతకారిణితవ శ్రీఖండచర్చావిషం
శీతాంశు స్తపనో హిమంహుతవహః క్రీడాముదో యాతనా.　　౧౦

తా॥ విపరీతమైన నడవడికలుంగల యో రాధా! ఎందువలన యాకృష్ణస్వామి సరసుండగు చుండంగా నీవు కఠినురాలవగు చున్నావో? ఏ కారణమున యాప్రియుండు నమ్రుండగుచుండగా నీవు నిరసనరాలువగు చున్నావో? ఎందుచేత నా శ్రీకృష్ణుండు అనురాగముగలవాండగుచుండంగా నీవు ద్వేషముగలదాన వగుచున్నావో? ఏల; ఆ గోపీలోలుండు ప్రసన్నుండుగాం నీవు విముఖురాలవగు చున్నావో? ఆ కారణము వలననే సుమా! నీకు శ్రీగంధలేపనము విషముగాను, చంద్రుండు సూర్యుండుగాను, మంచు నిప్పుగాను, క్రీడాజన్యమగు సంతసము తీవ్రవేదన గాను, అగుచున్నది. ఇదియుక్తమే.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
న వ మ స్స ర్గః.

---

# శ్రీ గీతగోవిందే దశమస్సర్గః.



శ్లో॥ అత్రాంతరే మసృణ రోషవశాదసీమ
నిశ్వాసనిస్సహాముఖీం సుముఖీముపేత్య
సవ్రీడమీక్షిత సఖీవదనాం దినాంతే
సానందగద్గదపదం హరిరిత్యు వాచ.　　౧౧

సీ॥ అంతలో నారాత్రి ♦ సంతసంబునం గృష్ణుండా రాధ నటు చూడం ♦ దారసిలుచుం
దావచ్చి మిక్కిలి ♦ దట్టమౌ కోపంబుచేం జాల నిట్టూర్పుం ♦ జెందు ముఖము
గలదాని సిగ్గుచే ♦ నిలసిల్లు నట్టుగాం జెలిముఖంబును జూచి ♦ మెలంగుదాని
రాధికా మణిం జూచి ♦ సాధారణాతీత మేధావిశేషాను ♦ బోధంజెంది

తే॥ చాల డగ్గుత్తికను బొంది ♦ తూలంబోయి
భాషణంబులు గడు తొట్రు ♦ పాడవడంగ
గరుణ దళుకొత్తం గాంతులు ♦ గడలి మీఱం
బలికె నవ్వేళ యుల్లముః ♦ పల్లవింప.

తా॥ అయ్యవసరంబున శ్రీకృష్ణమూర్తి సాయంకాలపు వేళ వచ్చి, పట్టరానికోపమున బెట్టిదమగు నిట్టూర్పులచేత సహించుకొనుటకు శక్యముగాని ముఖము గలిగినట్టిన్ని, సిగ్గుతోం గూడుకొన్నట్టుగా చెలికత్తెయొక్క ముఖమును చూచుచున్న ప్రసన్నముఖియైనదిన్ని అగు రాధనుగూర్చి సంతోషముతో గూడుకొనుట వలన డగ్గుత్తికను బొంది భాషణంబులు తొట్రుపాటువడంగ కరుణదళుకొత్త కోరికలు మీఱ, ఉల్లము పల్లవింప గద్గదస్వరముతో నిట్లు పలికెను.

# ఏకోనవింశాష్టపదీ ప్రారంభః.

(దేశవరాళి రాగేణ గీయతే.)

పల్లవి. ప్రియేచారుశీలే - ప్రియేరమ్యశీలే.

౧. వదసియదికించిదపిదంతరుచికౌముదీ హారతుదరతిమిరమతి ఘోరమ్
స్ఫురదధరసీధవేతవవదనచంద్రమా-రోచయతులోచనకోరమ్॥ప్రి

౨. ముంచమయిమానమనిదానం-సపదిమదనానలో దహతిమమమా
నసందేహిముఖకమలమధుపానం-ప్రియేచారుశీలేప్రియేరమ్యశీలే॥ప్రి

౩. సత్యమే వాసి యది సుదతిమయి కోపినీ-దేహిఖరనఖర శరఘాతం
ఘటయ భుజబంధనం జనయరదఖండనం- ఏనవాభవతుసుఖజాతం

౪. నీలనళి నాభమపి తన్వితవలోచనం - ధారయతి కోక నదరూపం
కుసుమశరబాణ భావేనయది రంజయసి కృష్ణమిదమేతదనురూపం

౫. త్వమసిమమ భూషణం త్వమసి మమ జీవనం-త్వమసి మమ భవ
జలధిరత్నం - భవతు భవతీహమయి సతతమనురోధినీ-తత్ర మమ
హృదయ మతియత్నం ॥ప్రి॥

౬. స్ఫురతు కుచకుంభయో రుపరి మణిమంజరీ - రంజయతుతవహృద
యవేశం రసతురశనాపి తవఘన జఘనమండలే ఘోషయతు మన్మ
ధనిదేశం ॥ప్రి॥

౭. స్థలకమల భంజనం మమహృదయరంజనం జనితరతి రంగపరభాగం
తవమశృణవాణి కరవాణి చరణద్వయం - సరససదల క్తకసరాగం

౮. స్మరగరళఖండనం మమశిరసిమండనం- దేహిపద పల్లవముదారం
జ్వలతిమయిదారుణోమదనకద నానలోహరతుతదుపాహితవికారం

౯. ఇతిచటులచాటువటు చారుమురవైరిణా-రాధికా మధివచనజాతం
జయతు పద్మావతీ రమణజయదేవకవి-భారతీ భణితమితి గీతం॥ప్రి॥



తా॥ [1] ఒప్పుచున్న శీలముగల యో ప్రియురాలవైనరాధా! కొంచె
ముగా మందహాసమును చేసితివా! నీ దంతములయొక్క కాంతి
యనెడి వెన్నెల నా వెఱపనెడి చీఁకటిని హరించును గాక; నీ
ముఖ చంద్రునిలోని యధరామృతము కొఱకు నాలోచనములనెడు
చకోరములు పానాపేక్ష నొందును గాక; [2] నాయందు కారణ
ములేని కోపము నువిడువుము. ఇప్పుడు మన్మథాగ్ని నామనస్సును
దహింపుచున్నది, నీ ముఖకమలము వలని తేనెపానమును నాకు
యిమ్మా! [3] ఓ రాధా! నీవు నాయందు నిజమైనకోపము గల
దాన వైతివేని నీ తీక్ష్ణమైన గోళ్ళనెడి బాణములచే బాధింపుము
నీ బాహులతలచే నన్ను కట్టివేయుము, నీ దంతములచే నన్ను
గాయపరుపుము. దేనిచేతనైనను సుఖములు కలుగునుఁ గాక!
[4] ఓ తన్వీ! నీకనులు నల్లకల్వలకాంతి వంటివైనను కెందామరల
యొక్క ఆకారమును ధరింపుచున్నవి. ఈ కన్నులు మన్మథుని
బాణ భావములనుఁజెంది నీలవర్ణుఁడనగు నన్ను రంజింపఁజేయునవి
యాయెనా? యెఱ్ఱతామర రూపమును ధరించుట యను రూప
మైనదిగా నగును. [5] ఓ ప్రియురాలా! నీవు నాకు అలంకార
మగుచున్నావు, నీవు నా జీవనముగా నగుచున్నావు; నీవు నా
సంసారమనెడి సాగరమునందలి రత్నమవు అగుచున్నావు. ఇప్పుడు
నీవు నాయందెల్లప్పుడును, అనుకూలము గలదానివే అగుదువు
గాక; అందులకై నాడెందము విశ్వప్రయత్నము గలదగుచున్నది.
[6] ఓ కామినీ! నీకుచకుంభముల మీఁది రత్నహారములు ప్రకా
శించును గాక; నీ హృదయప్రదేశము రంజిల్లును గాక; నీకటిపురో
భాగమందు మొలనూలు ధ్వనించుచు మదనుని యాజ్ఞను
చాటించును గాత; [7] ఓ మృదుభాషిణీ! రాధా! మెట్టతామర
లను పరిహసించునట్టిదియు, నామనస్సును సంతోషపెట్టునట్టిదియు,

పుట్టింపఁబడిన సురతముయొక్క యుత్తమాంశము గలిగినదియు, అగు నీ పాదద్వయమును, మృదువైన శ్రేష్ఠమగు లత్తుకలచేత రక్తిమతోఁ గూడిన దానిఁగాఁ జేయుచున్నాను. (8) ఓ ప్రియా! మదనుడనెడి విషమును ఖండించునట్టిన్ని, నా శిరస్సున కలంకారమైనట్టిన్ని, అగు నీయొక్క శ్రేష్ఠమైన చివురుటాకుల బోలిన పాదమును ఇమ్మా! భయంకరమైన మన్మథ యుద్ధమనెడి అగ్ని నాయందు ప్రజ్వలింపుచున్నది. అందువలన పొందఁబడిన తాపమును పోగొట్టును గాక. (9) ఈ విధముగా చంచలమైన నేర్పు మాటలచేత సమర్థుఁడయినట్టిన్ని, ఒప్పుచున్న శ్రీకృష్ణునిచేత రాధికామణిని గూర్చి వలుకబడిన వాక్యసమూహముఁ గలిగినట్టిన్ని, అగు పద్మావతీ ప్రియుఁడైన జయదేకవి వాక్కులచేఁ గూర్పఁబడిన దగు యీ గీతము సర్వోత్కృష్టమై వర్తించును గాక!

శ్లో॥ పరిహరకృతాతంకే శంకాం త్వయానతతంఘన
స్తనజఘనయాక్రాంతే స్వాంతే పరానవకాశిని
విశతివితనో రన్యా ధన్యా నకాపి మమాంతరం
స్తనభరపరీరంభారంభే విదేహి విధేయతాం. ॥౧

52 శ్లోకము లగాయితు 56 శ్లోకమువరకు ఆంధ్రీకరించిన పద్యములు లేవు.

తా॥ ఓ సంశయముగల రాధా! నీ సందేహమును వీడుము. గొప్పలైన కుచములును పిరుదులును గలిగిన నీకంటె మఱియొకరి యెడల నవకాశమీయని నాచిత్తము నిత్యము నాక్రమించుచుండఁగా, మన్మథునికంటె మరియొక కృతార్థురాలగు నే యితర వనితయు నాస్థలము నాక్రమింపఁజాలదు. నీ స్తనభారయొక్క ఆలింగన సౌఖ్యముకొఱకు చేయఁదగిన కార్యమును జేయుమా!



శ్లో॥ వ్యథయతివృథా మౌనంతన్వి ప్రపంచమ పంచమం
తరుణి మధురాలాపైస్తాపం వినోదయదృష్టిభిః
సుముఖివిముఖీ భావం తావద్విముంచ నముంచమాం
స్వయమతి శయస్నిగ్ధోముగ్ధే ప్రియోఽయముపస్థితః ॥౩

తా॥ ఓ ముద్దరాలగు రాధా! మిక్కిలినునువుకాఁడైనట్టిన్ని, ప్రియుఁడైనట్టిన్ని, యీ కృష్ణుడు తానుస్వయముగా వచ్చియున్నాడు. అట్టి నన్ను, విడువకుము. ఓ మోహనాంగీ! నీయొక్క వ్యర్థమైన మౌనము నన్ను బాధించుచున్నది, ఓ తరుణీ! నీ మధురవాక్యములచే పంచమస్వరము విస్తరింపఁజేయుము, నీకటాక్ష వీక్షణములచేత నా తాపమును బాపుము. ఓ సుముఖురాలా! నీ విముఖత్వమును పూర్తిగా దొలఁగింపుము.

శ్లో॥ ముగ్ధేవిదేహిమయి నిర్దయదంత దంశం
దోర్వల్లిబంధనిబిడ స్తనపీడనాని
చండీత్వమేవ ముదమంచన పంచబాణ
చండాల కాండదళ నాదసవః ప్రయాంతు. ॥౪

తా॥ ఓ వివేక శూన్యురాలా! నాయందు దయలేనట్టుగా దంతకసిగాట్లును, ఆలింగనమును, కఠినములైన స్తనపీడనమును, చేయుము. ఓ కోపముగల రాధా! నీ పరమందానందమును బొందుమా! మదనుఁడనెడి పాపాత్ముని బాణములవలన వ్రీక్కలింపఁబడు నాప్రాణములను పోకుండవలయును గాక!

శ్లో॥ బంధూకద్యుతిబాంధవోఽయమధరఃస్నిగ్ధోమధూకచ్ఛవిః
గండేచండి చకాస్తి నీలనళిన శ్రీమోచనం లోచనం
నాసాభ్యేతి తిలప్రసూన పదవీం కుందాభ దంతప్రియే
ప్రాయస్త్వన్ముఖ సేవయా విజయతే విశ్వం సపుష్పాయుధః. ॥౫

తా॥ మల్లెమొగ్గలవంటి దంతపంక్తిగల యో రాధా! ఆ మదనుఁడు తరుచుగా నీముఖసేవ వలననే జగత్తును జయించుచున్నాఁడు. నీ మోవి మంకెనపూల కాంతికి చుట్టమై ప్రకాశించుచున్నది. ఓ కుపితురాలా! నీ గండస్థలమునందు నున్నని యశోకపూలవంటి కాంతి ప్రకాశించుచున్నది. ఓప్రియురాలా! నీ నేత్రములునల్లకలువల కాంతులను పరిహసించు కాంతులతో బ్రకాశించుచున్నవి. నీ ముక్కు నువ్వుపువ్వుయొక్క పద్ధతిని ననుసరించుచున్నది.

శ్లో॥ దృశౌతవమదాలసే వదనమిందుమత్యుజ్వలం
గతిర్జనమనోరమా విధుత రంభమూరుద్వయం
రతిస్తవకళావతీ రుచిరచిత్రరేఖే భ్రువా
అహో! విబుధయావతం వహాసి త్వపృథివీంగతా. ౧౮

తా॥ ఓ తన్వీ! నీ నేత్రములు మదముచేత (1) నలసములై యున్నవి. నీ ముఖము (2) చంద్రునతిక్రమించి ప్రకాశించునట్టిది, నీ నడక జనులకు. (3) మనోహరమైనది. నీ యూరుద్వయము (4) రంభా తరువుల పరిహసించునట్టిది. నీ సురతము. (5) కళల్గు గలిగినది నీ కనుబొమలు. (6) చిత్రరేఖవలె యొప్పుచున్నవి. నీవు భూమి నవతరించినదానవై దేవతా స్త్రీ బృందమును వహించుచున్నావు ఆశ్చర్యము.

(1) మదాలస (2) ఇందుమతి (3) మనోరమ (4) రంభ (5) కళావతి (6) చిత్రరేఖ వీంద్ర నొప్పుచుంటివని ద్వర్థిగా చమత్కారముగా వర్ణించెను.

శ్లో. శుచిరమనునయేన ప్రీణయిత్వామృగాక్షీం
గతవతిప్రియవేషే కేశవేకుంజశయ్యాం
రచితరుచిర భూషా దృష్టిమోషేప్రదోషే
స్ఫురతినిరవసాదాం కాపిరాధాం జగాద. ౧౯



సీ॥ సౌగంధి మాణిప్ర ♦ శస్త భూషణ పాళి
యనురాగ కళిక నా ♦ యనువు నొసఁగ
మౌక్తిక హారస ♦ మంజస ప్రభలెదన్
మరుని ముల్కులు నాటు ♦ వెరవుదెలుప
శ్యామల రుచిరాంగ ♦ ధామ వైభవమంగ
జాతాగ్ని కమలిన ♦ జాడవిప్ప
నను నయానూనదీ ♦ నాలాప ముఖరత
సంచారికాభావ ♦ సరణి నెరప

తే॥ నునుపు విరిశయ్య నుండు, కృ ♦ ష్ణునటు సూచి
జారిణులకు నాథనిదాన ♦ సరణిఁ జూపు
సంజచీఁకటి గప్పును ♦ త్సాహలీల
రాధతోఁబల్కె నొక్క బిం ♦ బాధరిట్లు.

తా॥ విలాసవేషము నలంకరించుకొన్న శ్రీకృష్ణుఁడు, కురంగలోచన యగు రాధను మిక్కిలి ఱడవుగా ముద్దుగుల్కు మాటలాడుట చేత సంతోషపెట్టినవాఁడయి, పొదరింటియుందుగల, పూపాన్పును బొందించుచుండఁగా, సురుచిరములగు భూషణములచే భూషితురాలగు నొకానొక చెలికత్తె; చూపుల నపహరించినట్టి ప్రదోష కాలము ప్రకాశించుచుండగా కృశత్వములేనట్టి రాధనుగూర్చి యిట్లు పలికెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
దశమస్సర్గః.

---

# గీతగోవిందే ఏకాదశ స్సర్గః.

విశాంష్టపదీ ప్రారంభః.

(మోహన వసంత రాగేణ గీయతే.)

పల్లవి. ముగ్ధే మధుమథనం రాధే - అనుగత మనుసర రాధే॥

౧. విరచితచాటువచన రచనం - చరణేరచిత ప్రణిపాతమ్
సంప్రతి మంజుళ వంజుళసీమ - నికేళిశయన ముపయాతమ్ ॥ము॥

౨. ఘన జఘన స్తన భార భరే-దరమందగ చరణ విహారం
ముఖరితమణి మంజీర ముపైహి - విధేహి మరాళవికారం ॥ము॥

3. శృణురమణీయతరం తరుణీజన-మోహన మధుపవిరావమ్
కుసుమశరాశన శాసనవందిని - పికనికరేభజ భావమ్ ॥ము॥

౪. అనిలతరళ కిసలయ నికరేణ-కరేణ లతానికురుంబం
ప్రేరణమివ కరభోరు కరోతి-గతింప్రతిముంచ విలంబం ॥ము॥

౫. స్ఫురితమనంగ తరంగవశాదివ-సూచిత హరి పరిరంభం
పృచ్ఛమనోహర హారవిమలజల-ధారమముం కుచకుంభం ॥ము॥

౬. అధిగతమఖిల సఖీభిరిదంతవ-వపురపి రతిరణ సజ్జమ్,
చండరసితరశ నారవడిండిమ-మభిసర, సరసమలజ్జమ్ ॥ము॥

౭. స్మరశర సుభగన భేదన సఖీషువ-లంబ్యాకరేణ సలీలమ్
చలవలయ క్వణితైరవబోధయ-హరిం నిజగతి శీలమ్ ॥ము॥

౮. శ్రీజయదేవ భణితమధరీకృత-హారముదాసి తవామమ్
హరివినిహిత మనసామధితిష్టతు-కంఠతటీ మపి రామమ్. ॥ము॥



తా॥ (1) ఓ రాధా! ప్రియమైన ముద్దుపలుకులు పలుకునట్టియు నీ పాదములకు నమస్కరించునట్టియు, ఇప్పుడు మంజులంబై వంజుళ పొద ప్రదేశమందు క్రీడాశయ్యను పొందినట్టియు, నీ శరణము జొచ్చినట్టియు, అగు శ్రీకృష్ణుని ననుసరింపుము. (2) ఓ రాధా! గొప్పలయిన పిఱుదల యొక్కయు స్తనములయొక్కయు గురుత్వమును వహించుటయందు ఇంచుకంత తిన్నఁదనమును జెందిన పాదములయొక్క సంచారము గలుగు నట్లుగాను, మ్రోగుచున్న మణిరత్నఖచితములైన మంజీరములు గలుగు నట్లుగాను, పోయి శ్రీకృష్ణుని పొందుమా! మరాళగమనమును వహింపుము. (3) ఓ రాధా! రమణీయ తరంబయినదియు రమణీ సమూహములను మోహింపఁ జేయునదియును అగు భృంగ సంగీతము నాలింపుము. కుసుమ శరుని శాసనము వలన కైవారములు గావించునట్టి కోవెలలయొక్క సమూహమునందు మనస్సు నిలుపుము. (4) ఓ రాధా! లతావితానములు గాలిచేత చంచలములై, చివుళ్ళ గుంపులనెడి హస్తములచేత ప్రేరణమును చేయుచున్నావో యనునట్లు పొలుపారుచున్నవి. ఇప్పుడు నీగమనమును గూర్చి ఆలస్యము రవంతైనను చేయకుము. (5) ఓ రాధా! మన్మథుని తరంగములయొక్క పారవశ్యము వలెనె యదురుచున్నట్టియు, సూచింపఁబడిన శ్రీహరి ఆలింగనము గలిగినట్టియు, ఒప్పుచున్న మౌక్తిక హారమనెడి నిర్మలమయిన నీటిధారలు గల నీ యీ కుచకుంభములను గూర్చి అడుగుమా! (6) ఓ రాధా! నీ యీశరీరము శ్రీకృష్ణునితోడి రతిరణమును చేయుట కాయత్త పడినది చెలికత్తెల కెల్లరకు తెల్లమైనది. ఓ కుపితురాలవగు రాధా! మొలనూలు డిండమస్వరమున మ్రోగుచు ధ్వనిగాగ ననురాగవతివై లజ్జను విడనాడి శ్రీకృష్ణుఁ డున్నెడకు వెళ్ళుమా! (7) ఓ

రాధా! మదనుని పూవుటమ్ముఁవలె పోమ్మా! నీకంకణముల రవములచేత నీకు స్వకీయమైన నడక స్వరూపమును శ్రీకృష్ణ స్వామికిఁ దెలియఁజేయుమా! (8) ముక్తాహారమును ధిక్కరించు నట్టిన్ని, వక్రతలేనట్టిన్ని, శ్రీజయదేవ కవిచేత వచింపబడినట్టిన్ని అగు యీ గీతము శ్రీకృష్ణుని మనస్సునందుంచుకొనెడి వారి యొక్క కంఠ ప్రదేశమునం దెడతెగ నట్టుగా నుండుఁగాక.

శ్లో. అక్ష్ణోర్నిక్షిపదం జనం శ్రవణయో స్తాపింఛ గుచ్ఛావళిం
మూర్ధ్ని శ్యామసరోజ దామకుచయోః కస్తూరికా పత్రకం
ధూర్తానా మభిసార సత్వరహృదాం విష్వఙ్ని కుంజేసఖి
ధ్వాంతం నీలనిచోళచారు సుదృశాం ప్రత్యంగ మాలింగతీ. ౫౮

తా॥ ఓ సఖీ! రాధా! కన్నులయందుఁ గాటుకయును, చెవులయందు కానుగ పూల గుత్తులును, శిరమునందు నల్ల కల్వల మాలికలును, స్తనములందు కస్తూరి మకరికాపత్రమును గలిగి పొదరింటియందు నీలవస్త్రము వలె నొప్పుచున్న చీఁకటిని గూర్చి వంచకులైనట్టి సంకేత స్థలములయందు త్వరతోఁ గూడిన మనస్సును గలిగిన స్త్రీలయొక్క ప్రత్యవయవమును గౌఁగలించుకొనుచున్నాఁడు.

శ్లో. కాశ్మీర గౌర వపుషా మభిసారికాణా
మాబద్ధ రేఖమభితో రుచిమంజరీభిః
ఏత త్తమాలదళ నీలతమం తమిస్రం
తత్ప్రేమహేమనికషోప లతాం ప్రయాతీ. ౫౯

తా॥ సంకేతస్థానమును గూర్చి పోవునట్టి స్త్రీలయొక్క కుంకుమము వలెనే గవుర వర్ణమయిన శరీరములయొక్క కాంతి సమూహము చేత నంతటను గట్టఁబడిన పంక్తులు గలిగిన కానుగచెట్ల ఆకుల వలెనే మిక్కిలి నల్లనైన యీ చీఁకటి, శ్రీకృష్ణునియొక్క యను రాగ మనెడి బంగారమునకు ఒరగల్లు వలె పొందుచున్నది.



శ్లో. హారావళీ తరళ గాంచనగాంచి దామ
మంజీర కంకణమణిద్యుతి దీపితస్య
ద్వారేనికుంజ నిలయస్య హరింనిరీక్ష్య
వ్రీడావతీ మదసఖీ మియమిత్యువాచ. ౬౦

తే॥ లలిత మంజీర కంకణ ♦ చలిత హార
మేఖ లాదుల కాంతిచే ♦ మెలఁగుచున్న
కుంజమందున్న హరిఁజూచి ♦ మంజరీతిఁ
దెలియ లజ్జించి రాధతోఁ ♦ బలుకఁ దొడఁగె.

తా॥ ఆతరువాత ముక్తాహారములయొక్క పంక్తియందుగల నాయక మణియొక్కయు, అందెలయొక్కయు, కడియములయొక్కయు, మాణిక్యములయొక్కయు, కాంతులచేతఁ బకాశింపఁ జేయఁ బడిన పొదరింటియొక్క ద్వారమునందు శ్రీకృష్ణమూర్తిని వీక్షించి ఈ దూతిక లజ్జనొందిన చెలియగు రాధనుగూర్చి యీప్రకారముగా పలికెను.

## ఏకవింశాష్టపదీ ప్రారంభః.

(బంగాళీ వరాళ రాగేణ గీయతే.)

పల్లవి. ప్రవిశరాధే మాధవ సమీపం.

౧. మంజుతర కుంజతల కేళిసదనే - ఇహావిలస రతిరభస హసితవదనే.
౨. నవభవదశోకదళ శయనసారే - ఇహావిలస కుచకలశ తరళ హారే.
౩. కుసుమచయరచితశుచివాసగేహే-ఇహావిలసకుసుమసుకుమారదేహే
౪. చలమలయపవన ఘనసురభిశీతే - ఇహావిలస విలసదళి లలితగీతే.
౫. మధుతరళ పికనికర నినదముఖరే-ఇహావిలసదశనరుచిరుచిరశిఖరే.
౬. వితత బహువల్లి నవపల్లవ ఘనే - ఇహావిలస పీనకుచకుంభజఘనే.
౭. మధుముదిత మధుపకులకలితరావే-ఇహావిలస మదనశరరభసభావే.
౮. విహితపద్మావతీ సుఖసమాజే - భణతి జయదేవ కవిరాజ రాజే.

తా॥ (1)రతి క్రీడల రభసముచేత నవ్వుచున్నట్టి ముఖముగల యో రాధా! మిగుల రమణీయమైన పొదరిల్లనెడి క్రీడాగృహము నందు మాధవుని సమీపమును గూర్చి ప్రవేశింపుము. ఈ పొదరింటి యందు, శ్రీకృష్ణునితో క్రీడింపుము. (2) కుంభములవంటి స్తనముల యందు కదలుచున్న ముత్యాల హారములు గల యో రాధా! నూత్నమగు యశోక పుష్పదళముల వలన నియమింపఁబడిన పాన్పుగల శ్రేష్ఠమగు నీపొదరింటి యందు శ్రీకృష్ణస్వామితో క్రీడింపుము. (3) పుష్పమువలె సుకుమారమైన దేహముగల యోరాధా! పుష్పసమూహము చేత సమకూర్పఁబడి పరిశుద్ధమైన యంతర్గృహము గలిగిన యీ పొదరింటి యందు మధుసూదనునితోఁ గ్రీడింపుము. (4) విలసితమైన తుమ్మెదల గానమువలె లలితమైన గానముగల యో రాధా! కదలుచున్న మలయ మారుతము వలన చల్లనైన యీపొదరింటి యందు నల్లనయ్యతో క్రీడింపుము. (5) దంతముల యొక్క కాంతిచేత నొవ్వుచున్న మావియొక్క యగ్రములు గల యో రాధా! వసంత ఋతువు నందు చంచలమైన కోవెలల యొక్క ధ్వనిచేత మ్రోయుచున్న యీపొదరింటి యందు మదన గోపాలునితోఁ గ్రీడింపుము. (6) బలిసిన కుంభములవంటి కుచములును, పిఱుదులును గల యో రాధా! వ్యాపించిన యనేకములయిన లతలయొక్క నవపల్లవముల చేత నిబిడమైన యీపొదరింటి యందు మురళీధరునితోఁ గ్రీడింపుము. (7) మదన శరరభసము చేత సంగమాభిలాష గలిగిన యోరాధా! మధువును గ్రోలుట చేత సంతోషమును బొందియున్న మధుకర నికరము యొక్క యొప్పిదమైన ఝుంకారములతో నిండిన యీపొదరింటి యందు పుండరీకాక్షునితోఁ గ్రీడింపుము. (8) ఓ రాధా! పద్మావతీ సంబంధమైన



సౌఖ్యసమూహము గలిగిన శ్రీజయదేవ కవి రాజరాజు యీ గీతమును గానము చేయుచుండగా, నీవు మాధవుని సమీపించి క్రీడింపుము.

శ్లో. త్వాంచిత్తేన చిరంవహన్గమ యతిశ్రాంతో భృశం తాపితః
కందర్పేణతు పాతుమిచ్ఛదు సుధాసంబోధ బింబాధరం
అస్యాంకం సమలం కురుక్షణమిహ భ్రూక్షేపలక్ష్మీలవ
క్రీతే దాసజనోపసేవిత పదాంభోజే కుతస్సంభ్రమః. ౬౧

శ్లో. సాససాధ్వ సశానందం । గోవిందే లోలలోచనా
శింజాన మంజుమంజీరం । ప్రవివేశ నివేశనం. ౬౨

సీ॥ మదనావ మృత్యువున్ ♦ మాపసుధానిధి
యగు కీవి నీమోవి ♦ నాని యలర
ననుతు వేధాదరి ♦ ద్రముఁబావ వసుఖని
శ్రీఁగుల్కు నీకుల్కు ♦ చేకొనంగ
స్మర వర జ్వరమడం ♦ చఁగనోష ధీవల్లి
గతిఁ బూనునీమేను ♦ కౌఁగిలించ
సంగజు బాణాగ్ర ♦ హంబ డంపఁగ మంత్ర
మని శంబు మణితంబు ♦ నొనర వినఁగ

తే॥ గీ॥ సారె నువ్విళ్లు యూరనీ ♦ సామియదిగో
వెన్నెలకు గాచుజీవంబు ♦ వెరపుఁ జూచి
కాచెడి నటంచుఁ జెలిపల్కు ♦ కంజనయన
రంగుల లరంగ విభునిజే ♦ రంగవచ్చె.

తా॥ 61 ఓ రాధా! ఈ కృష్ణస్వామి, తడవులనుండి నిన్ను మనస్సునందు వహించువాఁడై వర్తింపుచున్నాడు. ఇంతేకాదు కందర్పుని చేత మిక్కిలి తాపము చెందినవాఁడై అలసటనుజెంది అమృతమును సూచించు నీయధరమును పానము చేయుటకు కోరుచున్నాఁడు.

ఆతని యంకతలమున క్షణకాల మలంకరింపుము. కనుబొమల చలనము వలని లక్ష్మీకటాక్షము మొసఁగ గలఁడని దానజనుల చేత సేవింపఁబడిన పదాబ్జములు గల శ్రీకృష్ణస్వామి యెడల భీతిఁ జెందెదవేల? 62 శ్రీకృష్ణుని యందాసక్తిని వహించిన యారాధ భయమును సంతోషమును కూడ కొన్నదై శింజాన మంజు మంజీరము గలదై వలపు తీపిఁజూప లీలాగృహమున బ్రవేశించెను.

---

# ద్వావింశాష్టపదీ ప్రారంభః.

(మాళవ రాగేణ గీయతే)

పల్లవి॥ హరి మేకరసం చిరమభిలషిత విలాసం-
సాదదర్శగురు హర్షవశంవద వదనమనంగవికాసం.

౧. రాధావదన విలోకన విలసిత-వివిధవికార విభంగమ్.
జలనిధిమివ విధు మండల దర్శన-తరళిత తుంగతరంగమ్.

౨. హారమమల తర తార మురసి-దధతంపరి రభ్యవిదూరం
స్ఫుటతరఫేన కదంబ కదంబిత-మివ యమునా జలపూరం.

3. శ్యామల మృదులకళేబర మండన-మధిగత గౌరదుకూలం
నీలనళినమివ పీతపరాగ-పటల భరవలయిత మూలం.

౪. తరళదృంగచల చలనమనోహర-వదనజనిత రతిరాగమ్
స్ఫుటకమలోదర ఖేలితఖంజన-యుగమివ శరదితటాకమ్.

౫. వదనకమల పరిశీలనమిలిత-మిహిరసమ కుండలశోభమ్
స్మితరుచి రుచిరసముజ్జ్వలి-తాధరపల్లవ కృతరతిలోభమ్.

౬. శశికిరణచ్ఛురితో దరజలధర-సుందర కుసుమసు కేశమ్
తిమిరోదిత విధుమండల నిర్మల-మలయజ తిలక నివేశమ్.



౭. విపులపులక దరదంతురితమ్-రతి కేళికళాభి రధీరమ్
మణిగణకిరణ సమూహసముజ్జ్వల-భూషణ సుభగశరీరమ్.

౮. శ్రీజయదేవ భణితవిభవమ్-ద్విగుణీకృత భూషణభారమ్
ప్రణమతహృది వినిధాయహరిమ్-సుచిరం సుకృతోదయ సారమ్.

తా॥ ఆరాధ! ముఖ్యమైన యనురాగము గలిగినట్టిన్ని, చిరకాలముఁ నభిలషింపఁబడిన క్రీడలు గలిగినట్టిన్ని, అధికమైన యానందమునకు స్వాధీనమైన వదనము గలిగినట్టిన్ని, మదన కాంతివంటి కాంతి గలిగినట్టిన్ని, రాధావదన విలోకన విలసిత వివిధ వికార రీతులు గలిగినట్టిన్ని శ్రీకృష్ణస్వామిని, చంద్రమండలమును చూచుటవలన చలింపఁబడిన గొప్పలగు తరంగములు గలిగిన సముద్రునివలె చూచెను. (2) మిగుల స్వచ్ఛమైన నాయకమణి గలిగిన ముక్తాహారమును దీర్ఘమగునట్టుగా వక్షస్థలమునందు చేర్చుకొని ధరింపబడుచున్నట్టిన్ని, మిగుల వ్యక్తమైన నురుగుల సమూహముతోఁ గూడుకొనియున్న యమునానదీ ప్రవాహము వలె నున్నట్టిన్ని, శ్రీకృష్ణుని యారాధ చూచెను. (3) ఇంద్ర నీలవర్ణమును కోమలమును అయిన శరీరముయొక్క యలంకారము గలిగినట్టిన్ని, పొందఁబడిన పీతాంబరము గలిగినట్టిన్ని, పచ్చ నయిన పుష్పరజముచేఁ జుట్టబడిన మొదలు గలిగిన నల్లకలువ వలె నున్నట్టిన్ని శ్రీ హరిని చూచెను. (4) చంచలమైన కడగన్నులయొక్క చలనముచేత మనోహరమైన వదనముచేత పుట్టింపఁబడిన క్రీడలయం దనురాగము గలిగినట్టిన్ని, వికసించిన పద్మములమధ్య ప్రదేశమందు క్రీడించుచున్న కాటుక పిట్టల యొక్క జంటలుకలిగిన శరత్కాలమందలి తటాకమువలె నున్నట్టిన్ని, శ్రీ కేశవుని ఆరాధ దర్శించెను. (5) వదన కమలమున కలంకారగాఁ గై జేసిన సూర్యునితో సరియైన కుండములయొక్క

కాంతి గలిగినట్టిన్ని, చిఱునగవు కాంతులచేత ప్రకాశింపఁబడిన పల్లవాధరముచేత చేయబడిన సురతాభిలాష గలిగినట్టిన్ని, శ్రీమురళీమోహనుని ఆరాధ వీక్షించెను. (6) చంద్రకిరణములచేత వ్యాప్తమైన మధ్య ప్రదేశము గలిగిన మేఘమువలె సుందరమైన పుష్పములతోఁ గూడిన మంచి వెండ్రుకలు గలిగినట్టిన్ని, చీకఁటి యందుదయించిన చంద్రునివలె స్వచ్ఛమైన శ్రీగంధపుబొట్టు గలిగినట్టిన్ని శ్రీజలజ నయనుని ఆరాధ తిలకించెను. (7) విపులమయిన రోమాంచములచేతను, ఇంచుకంత మిట్టపల్లములుగాఁ జేయఁబడినట్టి సురత క్రీడలయొక్క కళలచేత ధైర్యములేనట్టిన్ని, మణిగణకిరణము సమూహ సముజ్జ్వల భూషణములచేత నొప్పుచున్న శరీరము గలిగినట్టిన్ని శ్రీ చక్రధరుని యారాధ కనుగొనెను. (8) ఓ మానవులారా! ఈ ప్రకారముగా శ్రీ జయదేవ కవివర్యునిచేత వర్ణింపఁ బడిన విభవము గలిగినట్టియు, ద్విగుణీకృత భూషణముల భారము గలిగినట్టియు, పుణ్యములయొక్క యావిర్భావము వలన శ్రేష్టమయినట్టియు శ్రీ జగదీశ్వరుని స్థిరముగా నిల్పుకొని సమస్కరింపుఁడు.

శ్లో. అతిక్రమ్యాపాంగం శ్రవణపదపర్యంతగమన
ప్రయాసేనేవాక్ష్ణో స్తరళతర భావంగమితయోః
ఇదానీంరాధాయాః ప్రియతమసమాలోక సమయే
వపాతస్వేదాంబు ప్రసరఇవ హర్షాశ్రునికరః. ౬౩

తా॥ ఇప్పుడు కడగన్ను నతిక్రమించి చెవుల పర్యంతమును బోవుటచేతనైన ప్రయాసము చేతనో యనునట్లు మిక్కిలి చాంచల్యమును బొందినట్టి రాధయొక్క కన్నులయందు శ్రీకృష్ణుని దర్శన సమయమందు ఆనందభాష్ప సమూహము చెమటల ప్రవాహము వలెనే వడెను.



శ్లో. భజంత్యాస్తల్పాంతం కృతకపటకండూతి విహిత
స్మితంయాతే గేహాద్బహిరపి హితాళి పరిజనే
ప్రియాస్యం పశ్యంత్యాః స్మరశరసమాకూద సుభగం
సలజ్జాలజ్జానైగమది వసుదూరం మృగదృశః. ౬౪

తా॥ ఇష్టసఖీ! పరిజనము పొదరింటినుండి వెలపటికి వెళ్లిపోవుచుండగా, కృత్రిమపు తీటను కలిగినట్లుగ మందహాసము చేయుచు శయ్యను సమీపించునట్టియు, స్మరశరములకయి క్రీడను గోరుచున్నట్టియు, శ్రీకృష్ణుని మొగమును చూచునట్టి రాధకు సిగ్గు సిగ్గుతోఁ గూడుకొన్నదై, మిక్కిలి దూరముగా పోయెనోయన్నట్లుండెను.

ఇతి శ్రీకృష్ణదాస జయదేవకృతౌ గీతగోవిందే మహాకావ్యే
ఏకాదశస్సర్గః.

---

# ద్వాదశస్సర్గః.

---

శ్లో. గతవతిసఖీ బృందేమందత్ర పాభరనిర్భర
స్మరశరవశాకూత స్ఫ్యూతస్మిత స్నపితాధరా
సరసమలసిందృష్టాం ముహుర్నవ పల్లవ
ప్రవనవశయనే నిక్షిప్తాక్షీముశాచ హరిప్రియాం. ౬౫

సీ॥ నెలనంచు నొంచు వె ♦ న్నెలయించు నొంచునన్
జిరునవ్వు నవ్వు మో ♦ మొరవుదాని
మరువింటి నంటివే ♦ మరునొంటి చంటి ప
క్కను గుల్కు కుల్కు చూ ♦ పలరుదాని

దెరదీవి కావికా ♦ తెరతీవి తావియ
యొయ్యాజుల్కా జుల్కామా ♦ టాడుదాని
వడిఁదాకు బాకు కై ♦ వడిఁ బ్రాకుమా కుమా
రుని గాంచు నంచుపైఁ ♦ బెనుచు దాని
తే॥ సుందరా మంద మందాక్షు ♦ మొందు తనదు
డెంద మందందడిందు మే ♦ ల్పొందు దాని
నిందిరా నందనుఁడు సొక్కు ♦ మందఁబోలు
యిందుముఖిఁగాంచి పల్కె గో ♦ విందుఁడపుడు.

తా॥ సమూహాము వెడలిపోవుచుండగా మందమగు వ్రీడాభారాధిక్యము చేతను మన్మథ బాణములకు లోఁబడిన యభిప్రాయము చేతను, కూర్పఁబడిన చిరునవ్వుచేతను, తడుపఁబడిన పెదవిని గలిగినట్టిన్ని, నూతనలైన చివుళ్ళచేతను పుష్పములచేతను చేయఁబడిన పాన్పునందు దృష్టి గలిగినట్టియు, హర్షముతోడను వెలయుచున్నట్టియు, రాధను మాటిమాటికి చూచి, శ్రీకృష్ణమూర్తి మెల్లగా సరసయుక్త మానట్టుగా పలికెను.

---

# త్రియోవింశాష్టపదీ ప్రారంభః.

( నాథనామక్రియా రాగేణ గీయతే. )

పల్లవి॥ క్షణమధునా నారాయణమ్-అనుగత మనుభజరాధే॥
౧. కిసలయశయన తలే కురు కామిని-చరణనళిన వినివేశం
తవపదపల్లవ వైరిపరాభవ మిదమను భవతు సువేశం ॥క్షణ॥
౨. కరకమలేన కరోమి చరణమహ-మాగమితాసి విదూరం
క్షణముపకురు శయనోపరిమామివ-నూపుర మనుగతి శూరం॥క్ష



3. వదనసుధానిధి గళితమమృతమివ-రచన వచనమనుకూలం
విరహమివాపనయామి పయోధర-రోధక మురసిదుకూలం ॥క్ష॥
౪. ప్రియపరి రంభణ రభస రభసమివ-పులకితమతి దురవాపం
మదురసి కుచకలశం వినివేశయ-శోషయ మనసిజ తాపం ॥క్ష॥
౫. అధరసుధారస ముపనయ భామిని-జీవయ మృతమివ దాసం
త్వయివినిహిత మనసం విరహానల-దగ్ధవపుష మవిలాసం ॥క్ష॥
౬. శశిముఖి ముఖరయ మణి-రశనాగుణ-మనుగుణ కంఠనినాదం
శ్రుతియుగళే కురు తవవికలేమమ-శమయ చిరాదవసాదం
౭. మామతివిఫల రుషావికలీకృతె- మవలోకిత మధునేదం
మీలతిలజ్జిత మివనయనంతవ - విరమవిసృజ గతఖేదం ॥క్షణ॥
౮. శ్రీజయదేవ భణిత మిద మనుపద - నిగదిత మధురిపు మోదం
జనయతురసిక జనేషుమనోరమ - రతిరసభావ వినోదం ॥క్షణము॥

తా॥ ఓ రాధా! ఇప్పుడు నీకనుకూలుఁడైన నారాయణుని క్షణకాలము సేవింపుము, (1) చిగురుటాకుల పాన్పుయొక్క యుపరిభాగము మీఁద నీపాదపద్మములనుంచుము. నీయొక్క పాదపల్లవములకు శత్రువైన యీపాన్పు తిరస్కార భేదము ననుభవించును గాక (2) ఓ రాధా! నేను నీపాదపద్మములకు నాకరపద్మముల నూతనొసంగెదను. నీవు బహుదూరము వచ్చిన దానవైతివి, కూడా వచ్చుటయందు సమర్థమైన కాలియందెలను పాన్పుమీఁద నున్న వలెనే క్షణమాత్రము సన్మతింప జేయుము. (3) ఓ రాధా! ముఖచంద్రుని వలన జారుచున్న యమృతమువలె ననుకూల వాక్యములను వచింపుము. వియోగక్లేశము వలెనే నీయొక్క పేరెదమీఁది పయ్యెదను తొలఁగించెదను. (4) ఓ రాధా! ప్రియుని ఆలింగనమందుఁ బురికొల్పు దానివలె నున్నట్టిన్ని, పొందుటకు శక్యముగానట్టిన్ని, నీపేరురమునందలి కుచకుంభము లను నావక్షః

స్థలము నందుంచుము. నన్ననుసరించి మనసిజ తాపమును పోగొట్టుము. (5) ఓ భామినీ! నీయధరసుధా మాధుర్యమును సేవింపఁ జేయుము. నీయందు నుంచబడిన మనస్సు గలిగినట్టిన్ని, విరహాగ్నిచేత తపింపఁబడిన శరీరము గలిగినట్టిన్ని, విలాసరహితుఁడై నట్టిన్ని నీకు భృత్యుఁడైనట్టిన్ని, మృతకల్పునివలె నున్నట్టిన్ని, అగు నన్ను బ్రతికింపుము. (6) ఓ చంద్రవదనా! నీ కంఠధ్వనికి సరియగు నట్లుగా మణికింకణులతోడి నీ మొలనూలిని మ్రోయించుమా! కోవెలల కూతలకు వికలములయిన నాచెవులయొక్క బహుకాలపు కృశత్వమును బోఁగొట్టుము. (7) ఓ మానినీ! మిక్కిలి వ్యర్థమైన కోపముచేత కలుషింపబడినట్టిన్ని, నీ చేత నిప్పుడు చూడబడినట్టిన్ని, అగు నన్ను రమించుము. నీ నేత్రములు సిగ్గుపడిన దానివలె ముకుళితములు అగుచున్నవి. ఈ మూసికొనుట యనెడి ఖేదమును పోవునట్లుగా విడిచిపెట్టుము. (8) శ్రీజయదేవ కవిచేతఁ జెప్పఁబడినట్టియు, ప్రతిపదమునందును శ్రీకృష్ణునియొక్క సంతోషమును గలిగినట్టియు, ఈ గీతము రసికజనుల విషయమై శృంగార రసముయొక్క భావములందు వినోదమును పుట్టించును గాక.

శ్లో. ప్రత్యూహః పులకాంకురేణ నిబిడాశ్లేషే నిమేషేణచ
క్రీడాకూత విలోకనేఽధరసుధా నర్మభిః
ఆనందాశ్రుగమేవ మన్మథకళా యుద్ధేఽపియస్మిన్నభూ
దుద్భూతస్సదయోర్బభూవ రమితా రంభః ప్రియంభావుకః ౧౧

(దీనికి తెలుగు పద్యములేదు)

తా॥ ఏరతి ప్రారంభమందు గాఢాలింగనమందు రోమాంచములును, క్రీడాభిప్రాయమును పొందిన చూపులందు తెప్పపాటులును, అధరపానావసరములందు నర్మభాషణములును, మన్మథునియొక్క



బంధవిశేషములనెడి యుద్ధమునందు ఆనందభాష్పములు, విఘ్నములు యాయెనో అవియే; తుదకు యారాధా మాధవుల యభీష్టప్రకారము సుఖపరినామకమయ్యెను.

శ్లో. దోర్భ్యాం సంయమితః పయోధర భరేణాపీడితః పాణిజై
రావిద్ధోదశనైః క్షతాధరపుట శ్రోణీతటే నాహతః
హస్తేనానమితః కచేధరసుధా స్యందేన సమ్మోహితః
కాంతః కామపితృప్తి మావదదహో కామస్యవామాగతిః. ౧౨

(తెలుగుపద్యము లేదు)

తా॥ శ్రీకృష్ణమూర్తి రాధతోడ శృంగారచేష్టలుగావించి యేకారణముచేత వాఙ్మానస గోచరమగు పరిపూర్ణానందము ననుభవించెనో ఆకారణముచేతనే మదనునియొక్క మదమణగి పోయెను ఆశ్చర్యము.

శ్లో. మారాంకే రతికేళిసంకులరణా రంభే తమాసాహస
ప్రాయంకాంత జయాయంకించి దుపరిప్రారంభియత్సంభ్రమాత్
నిష్పందా జఘనస్థలీ శిథిలితా దోర్వల్లిరుత్కంపితం
వక్షోమీలిత మక్షిపౌరుషరస స్త్రీణాం కుతస్సిద్ధ్యతిః ౧౩

(తెలుగుపద్యము లేదు)

తా॥ ఏకారణమువలన ఆరాధచేతను శ్రీకృష్ణమూర్తియొక్క జయముకొఱకు సంతోషమువలన సహసాధిక్యముగా నుపరిసురత కొంచెముపక్రమింపఁబడెనో ఆకారణము వలననే మన్మథుఁడే చిహ్నముగాగలసురత క్రీడచేత దట్టమైన మన్మథాయుద్ధారంభమునందు రాధయొక్క జఘనప్రదేశము నిశ్చలత్వము నొందియుండెను. బాహులతలోని శక్తి జారినది. వక్షస్థలముత్కంపమొందెను. నయనములు మూయబడెను. అదియుక్తమేకదా; నిజముగా నాడువాండ్రకు పౌరుషము కావలెనంటే యేలాగునవచ్చును?

శ్లో. తస్యాః పాటలపాణిజాంకితమురో నిద్రాకషాయేదృశౌ
నిర్ధౌతోఽధరశోణిమా విలులితాః స్రస్తస్రజో మూర్ధజాః
కాంచీదామ దరశ్లథాంచల మితి ప్రాతర్నిఖాతైర్దృశో
రేభిః కామశరై స్తదద్భుతమభూ త్పత్యుర్మనః కీలితం. ౧౯

(తెలుగుపద్యము లేదు)

తా॥ అరాధయొక్క వక్షస్థలము పాటలవర్ణమైన గోళ్ళచేత నాటిన చిహ్నములతో నొప్పెను. నేత్రములు నిద్రకొఱ కెఱ్ఱ దనంబుఁ జెందెను. పెదవిమీఁది రక్తిమమంతయు కడుగ బడెను. వెండ్రుక ముడి వదలుటచే పుష్పమాలికలు జారినవి. మొల నూలించుక జారి మొనలుగలదయ్యెను. ఇట్టివే శ్రీకృష్ణుని మనస్సు; వేకువ యయ్యెను రాధిగాయత్తముగ మెలఁగ జేసెను. అది కన్నుల కత్యంతాశ్చర్యము గదా?

శ్లో. అథకాంతం రతిక్లాంతమపి మండన వాంఛయా
జగాద మాధవం రాధాముగ్ధా స్వాధీన భర్తృకా. ౨౦

తే॥ గీ॥ అంత రతికాంత రతిశాంతుఁ ♦ డైనకాంతు
రమణ స్వాధీన భర్తృక ♦ రాధఁబలుకు
మండ నాంచిత, వాంఛచే ♦ మంజుతర, సు
ధారసోపమమృదుల వా ♦ క్తతుల నెనసి.

తా- అటు తరువాత, సౌందర్యవతియై నట్టిన్ని, పతిని స్వాధీనవతిచుకొన్నట్టిన్ని అనురాధ, శ్రీకృష్ణస్వామి రతిశ్రాంతుడై యున్నప్పటికిన్ని, అలంకరించుకొనవలయునను కోరికచేత యిట్లువలికెను.

## చతుర్వింశాష్టపదీ ప్రారంభః.

(రామక్రియా రాగేణ గీయతే.)

పల్లవి. నిజగాదసాయదునందనే - క్రీడతిహృదయానందనే.

౧. కురుయదునందన చందన శిశిర - తరేణ కరేణపయోధరే
మృగమదపత్రకమత్రమనోభవ - మంగళకలశ సహోదరే ॥నిజ॥



౨. అలికులభంజన మంజనకరంతి-నాయక సాయక మోచనే
త్వదధరచుంబనలంబితకజ్జల-ముజ్జ్వలయతి ప్రియలోచనే ॥నిజ॥

౩. నయనకురంగ తరంగవికాస - నిరాసకరే శ్రుతిమండలే
మనసిజపాశవిలాస ధరేశుభ - వేషనివేశయ కుండలే ॥నిజ॥

౪. భ్రమరచయం రచయంతము పరి-రుచిరం సుచిరం మమసమ్ముఖే
జితకమలే విమలే పరికర్మయ-నర్మజనకమలకంముఖే ॥నిజ॥

౫. మృగమద రసవలితం లలితం-కురుతిలక మలికరజనీకరే
విహితకళంక కళంకమలానన - విశ్రమితశ్రమ శీకరే ॥నిజ॥

౬. మమరుచిరే చికురే కురుమాధవ - మానస జధ్వజచామరే
రతిగళితే లలితే కుసుమాని - శిఖండి శిఖండకడామరే ॥నిజ॥

౭. సరసఘనేజ ఘనేమమశంబర - దారణవారణకంధరే
మణిరసనావసనా భరణాని - శుభాశయవాసయ సుందరే ॥నిజ॥

౮. శ్రీజయదేవ సుకవివచనే హృదయం-సదయంకురుమండనే
హరిచరణామృతకృత కలుష-జ్వరసంజ్వర ఖండనే ॥నిజ॥

తా॥ మనస్సునకు సంతసమును కలిగించు శ్రీ జగన్మోహనుని గూర్చి యారాధ యిట్లు పలికెను. (1) ఓ యదునందనా! చందనము వలె మిక్కిలి చల్లనైన నీ కరకంజములచేత మారుని మంగళార్థము లయిన నాగిరికుచములందు మకరికా పత్రింబులు చిత్రింపుము. (2) ఓ ప్రియుఁడా! మారుని బాణములకు నివారకమైన నా నయనములందు మోవి యొక్క చుంబనముచేతఁ బోందింపఁబడిన నానావర్ణము గలిగినట్టిన్ని తుమ్మెదల గుంపును తిరస్కరించునట్టి కాటుకను దిద్దుము. (3) ఓ శోభనాలంకారముల కృష్ణస్వామీ! నేత్రముల నెడి లేళ్ళయొక్క చలనమును నివారించునట్టిన్ని, మన్మథుని పగ్గములయొక్క విలాసమును ధరించియున్న నా కర్ణ ద్వయమునందు కమ్మల నలంకరింపుము. (4) ఓ నెయ్యుడవగు కృష్ణస్వామీ! అగ్రభాగమునందు తుమ్మెదల గుంపును తలపించు

నటిస్నీ, విలాసమును గల్పించుచు నొప్పుచున్నటిన్ని, నాముంగు రులను, సరసిజముల పరిహసించునట్టిన్ని, నిర్మలమైనట్టిన్ని అగు నాముఖ్యమునందు యెదుటను సవరింపుము. (5) ఓ కృష్ణస్వామి! విశ్రమింపఁబడిన చెమట బిందువులు గలిగిన నా లలాట మనెడి చంద్రునియందు మృగమదరసముచేత చంద్రకలంకమును జయిం పఁబడిన కళంక కళలు గలిగినట్టి తిలకమును సుందరముగా దిద్దుము, (6) ఓమాధవా! ఒప్పుచున్నట్టి మన్మథధ్వజముయొక్క చామరమువలె నున్నట్టిన్ని, సురతముచేత జారినట్టిన్ని, నెమలి పింఛమువలె కూడుకొన్నట్టిన్ని, నా కేశపాశములందు పుష్పముల నలంకరింపుము. (7)ఓ శుభాశయా! బలిమితో గూడుకొన్నట్టిన్ని ఘనమైనట్టిన్ని, మన్మథుని గజముయొక్క మెడను బోలినట్టిన్ని, నాపిరుదులయందు మణిగణమైన మొలనూలునున్ను, వస్త్రము నున్ను, భూషణములనున్ను, అలంకరింపుము. (8) ఓ మోహనా కారా! అలంకారమైనట్టిన్ని శ్రీహరి చరణ స్మరణామృతమువలన అపనయింపబడిన పాప సంతాపము గలిగినట్టిన్ని, శృంగారాది రసాలంకార సంపద్యుక్తమైన జయదేవకవియొక్క వాక్యములు గలిగిన యీ గీతగోవింద మనెడి వాక్యమందు హృదయమును దయతోఁ గూడిన దానినిగా చేయుమా!

శ్లో. రచయకుచయోః పత్రం కురుష్వకపోలయోశ్చిత్రం
ఘటయజఘనే కాంచీముంచ స్రజంతబరీ భరే
కలయవలయశ్రేణీం పాణౌపదేకురునూపురా
వితినిగదితః ప్రీతః పీతాంబరోఽపితథాకరోత్. ౭౧



సీ॥ అధరామృతంబున ♦ కరిగాఁపు పెట్టుమీ
కలిత నాసా మౌక్తి ♦ కచ్ఛలమున
స్తన దుర్గములకు ర ♦ క్షక పాళి గూర్పుమీ
చారు వక్త్రాతివ్యా ♦ జంబువలన
నీవిగావఁగ భటా ♦ నీకంబుఁ బూన్చుమీ
లలిత కాంచనమేఖ ♦ లామిషమున
గచనీల రత్నప్ర ♦ కరము లేడాచుమీ
క్రమకుసుమ దామ ♦ కైతవమున

తే॥ రమ్యవైభవ పదముల ♦ రక్షఁ జేయఁ
గటకముల నుంచుమీ, రూప ♦ కాంచనంబు
పురుష రత్న కలాపప్ర ♦ పూర్తిగావు
మీ, యనెడి రాధకజుఁ డిట్టు ♦ లింపొనర్చె.

తా॥ ఓ యదునందనా! నాకుచములందు మకరికా పత్రములను వ్రాయుము. చెక్కిళ్లయందు చిత్రలేఖలను చిత్రింపుము,కటి ప్రదేశమునందు మొలనూలును కూర్చుము. కేశ పాశము నందు పూదండ నలంకరింపుము, హస్తముల యందు కంకణ శ్రేణిని యలంకరింపుము పాదములకు అందెలను బొందుపఱుపుము, అని ఈప్రకారముగా రాధచేత యాజ్ఞాపింపబడిన వాఁడై యట్లే పీతాంబర ధరుఁడు రాధ నలంకరించెను.

శ్లో. యద్గాంధర్వ కళాసు కౌశల మనుధ్యానంచ యద్వైష్ణవం
యచ్ఛృంగార వివేకతత్వమపి యత్కావ్యేషు లీలాయుతం
తత్సర్వంజయ జయదేవపండితకవేః కృష్ణైకతానాత్మన
స్సానందాః పరిశోధయంతు సుధయ శ్రీగీతగోవిందతః. ౭౨

సీ॥ శ్రీప్రసాద సుపాద ♦ శ్లేషజంఘోజ్జ్వల
మధురోరు యుగసౌకు ♦ మార్యమధ్య
సామ్య ఘనశ్రోణి ♦ చారుదీవనకు చా
దార్య కంధరకాంతి ♦ దోర్యుగాఢ్య
స్యోజః కరాంబుజ ♦ సుసమాధి చుబుక
సద్వైదర్భ ముఖరోష్ఠి ♦ వచనదనర
కైశుక ముఖవృత్తి ♦ గండదృగ్భ్రూనాస
కావ్య పాకద్వయ ♦ కర్ణవదన
తే॥ భావశయ్యా ప్రవేణియై ♦ బరఁగు, పతికి
శ్రీనివాసేంద్రుఁ డాంధ్రంబుఁ ♦ జేసినట్టి
యష్టపదియను నాయికా ♦ శ్లిష్టుఁడగుచు
నందనందను డానంద ♦ మొందుఁగాత॥

తా॥ ఓ ప్రబంధము గాంధర్వ విద్యలయందు కుశల స్వభావముగలదో; ఏది విష్ణుసంబంధమును జెంది ధ్యానింపబడుచున్నదో; ఏది గుణ జ్ఞానముయొక్క తత్త్వము గలిగినదో; ఏకావ్యము నందు విలాస మొప్పియున్నదో; ఆసమస్తమును విష్ణుదాసు యెడల నంతఃకరణము గలిగి వెలయు శ్రీజయదేవ కవియొక్క శ్రీగీతగోవింద కావ్యము వలన విద్వాంసులు ఆనందముతో గూడుకొన్న వారలై పరిశోధించెదరుగాక.

శ్లో. శ్రీ భోజదేవ ప్రభవస్య రామా।
దేవీసుత శ్రీజయదేవ కస్య
పరాశరాది ప్రియవర్గ కంఠే।
శ్రీ గీతగోవింద కవిత్వమస్తు.





(నాదనామక్రియా—ఆదితాళము)

పల్లవి॥ శ్రీలక్ష్మీరమణ లోకా - శ్రిత శుభమంగళం॥ శ్రీ॥
౧॥ కౌస్తుభ మణిహార - కారుణ్యాకారధీర॥ శ్రీ॥
౨॥ ఘోరరాక్షసవీర - వారశిక్షితశూర॥ శ్రీ॥
౩॥ మాసేంద్ర మానసాబ్జ - మత్తాళినిభసత్య॥ శ్రీ॥
౪॥ రాధికాయానాబ్ధి రాకాసు కర॥ శ్రీ॥
౫॥ వసుదేవతనయ శ్రీని - వాస వేరదలీల॥ శ్రీ॥

తే॥ అరయ గంభీర భావముల్ ♦ యుణగియుండి
చూడ గాం పుణ్యసోపాన ♦ సూత్రమగుచు
పరమ ధర్మంబు బోధించి ♦ ప్రజలనెల్ల
ముక్తి రంజింపుగాకిది ♦ మూలమగుచు॥

ఇతి శ్రీకృష్ణదాస జయదేవ కృతౌ గీతగోవిందే మహాకావ్యే
స్వాధీన భర్తృకా వర్ణనే సుప్రీత పీతాంబరో
నామ ద్వాదశస్సర్గః.

పతికి శ్రీనివాసకవి ప్రణీతమైన ఆంధ్రాష్టపదీ
సమేత సాంద్ర తాత్పర్య సహితం
సర్వం సంపూర్ణము
శ్రీ. శ్రీ. శ్రీ.



రామమోహన ప్రెస్, రాజమండ్రి:—1936.

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి

( తాత్పర్య సహితము )

సోదరా !

రసమయాత్మకము, కావ్యములు, రసములు తొమ్మిది. వానికి శృంగారరసము నాయకమణి. దానిమూర్తిత్వమే కృష్ణరూపము. ఆప్రభునిలీలలు వర్ణించిన కవులు చాలతక్కువ. ఈగ్రంథమునందు గ్రంథకర్త భక్తులకు శ్రీకృష్ణజననము, బాల్యచేష్టలు, శైశవక్రీడలు, కాళీయమర్ధనము, గోపికావస్త్రాపహరణము, గోవర్ధనోద్ధరణము, గోపికలకు తత్త్వోపదేశంబుచేయుట, రాసక్రీడలు, రాధాకృష్ణసంవాదము, గోపికాగీతలు, కంసవధ, భ్రమరగీతలు, రుక్మిణీకళ్యాణము, కృష్ణుఁడు జాంబవతి మొదలగు నష్టభార్యలను పెండ్లాడుట కన్నులకుఁ గట్టినట్లు వర్ణించినాఁడు. నీ వెన్నిపాపంబులు చేసినను తరింపయత్నించు నుపాయము వెదుక వను మాట కల్ల. కృష్ణనామస్మరణము ముక్తిదాయకమని నీస్నేహితులకు నచ్చచెప్పఁ దలంచితివేని కృష్ణలీలాతరంగిణిని చూపుము.

వెల 0—12—0.

వలయువారు:—

**శ్రీసత్యనారాయణబుక్‌డిపో,**

బుక్సెల్లర్సు & పబ్లిషర్సు

రాజమండ్రి.

# యవనజాతకము

( తాత్పర్య సహితము )

చదువరీ !

లోకము తెనుఁగు మీఱినది. విద్యలన్నియు వెల్లడ యైనవి. మనుష్యున కైహికాముష్మికసుఖంబు లొసంగునవి శాస్త్రప్రపఠనములు. అట్టివానిలో జ్యోతిషశాస్త్ర మొక్కటి. దీనిని ప్రతివారును స్వయముగా తెలిసికొను టత్యావశ్యకమే. కాని ప్రతివారును తెలిసియు తెలియక ముందే ధనార్జనమునకై జ్యోతిషము చెప్ప మొదలిడుటచే నీనాఁ డీశాస్త్రమునకు గౌరవము తగ్గుచున్నది. మరియు నీశాస్త్రమునం దిష్టముకల వారు తమరహస్యములు బయలుపడునేమోయని యితరులకు జాతకములను జూపింపకపోవుటయు కద్దు. నీవు నీజీవితమునందలి కష్టనష్టములను, సుఖదుఃఖములను, మంచిచెడ్డలను, ఫలాఫలములను, నిజానిజములను తెలిసికొన నిచ్ఛయుండకపోదు. యవనజాతకము నొకమారు సమగ్రముగఁ జదివిన నీవితరుల నాశ్రయింపనక్కఱలేదు. నీయంతటనీవే నీజీవిత రహస్యములను దెలిసికొనఁగలవు. ప్రతివారును సులభముగా దెలిసికొన తేటతెలుగున తాత్పర్యము వ్రాయబడినది నమూనాకొకయుదాహరణము.

ప్రభవసంవత్సరఫలము.

శ్లో॥ సంగ్రహీ సర్వవస్తూనాం పుత్రసంపత్తి రేవ చ ।
దీర్ఘాయు ర్భోగసంపన్నః ప్రభవే జాయతే నరః॥

తా॥ ప్రభవసంవత్సరమున బుట్టినవాడు సమస్తవస్తువులను సంపాదించువాడును పుత్రసంపదలు కలవాడును గొప్పయాయువు కలవాడును భోగసంపన్నుడునునై యుండును.

వెల 0—8—0.

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి.

